## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

రవీంద్ర సాహిత్యము



# గీతాంజలి

# గీతాంజలి

రవీంద్రనాథ ఠాకూర్

అనుసరణ:

దుర్గానంద్



రవీంద్రగ్రంథమాల, విజయవాడ-2.

# ఆలాపన

విశ్వ ఇతిహాసంలో ఒకనాటి వసంతం ఒక క్రొత్తగాలిని ఆకాశం లోకి పంపింది. దేశదేశాలు తుష్ణీంభూతలై నిక్కి చూచినాయి. ఆ గాలి భారత దేశంమీదనుంచి వీచింది. ఖండాంతరవాసులు అబ్బురపడ్డారు. భావకుసుమా లను అంజలిలో నింపుకొని తన ప్రభువుకు అర్పించుకోవడానికి వెళుతున్న కళాతపస్వి అతను. చేతిలో మకరందం తొణికిసలాడుతున్న గీతాంజలి. దానిదీ—పరిమళమంతా. అతను విశ్వకవి, రవీంద్రుడు.

రవీంద్రుడు నిజంగా మన మానససరోవరంలో – ప్రపంచాని కంతటికీ ఎత్తయిన హిమాలయంలో వున్న మానససరోవరంలో వికసించిన పద్మం. ఏండ్లనుంచీ కరిగిపోతూవుంది కాలం. కాని ఆయన కరగలేదు. ఆయన గీతాంజలి కరగలేదు. కరగదు. కదుల్తుంది. అలాంటి స్మారకం అది. మూడు కాలాల్లో ఎప్పుడూ తెగిపోని శ్వాసకోశాల్తో మన మధ్యన, నాసికాపుటాలు విప్పి ఊపిరి పీల్చి విడుస్తున్న సజీవస్మారకం. దేశానికి తాజమహాలు ఎలాగో నాకు గీతాంజలి అలా. మొగలాయీల బహిఃప్రాణ సౌందర్యాన్ని చూపిం చింది తాజమహాలు. హిందువుల అంతస్సౌందర్యాన్ని చూపించింది గీతాంజలి. హిందువులు భావనోప జీవులు, రసైక హృదయులు, వాళ్ళది యీ కావ్యం.

రవీంద్రుడు విశ్వకవి. మేరుపర్వతంలా చుక్కలదాకా పెరిగి పోయిన రవీంద్రుడు, పూర్వ పశ్చిమ మానవుని అంతరాంతరాల్లో అధిష్ఠించిన రవీంద్రుడు, విశ్వభారతి నిర్మాత, వెండితీగల్లా మెరుస్తున్న నిడుపాటి గడ్డం, ఎత్తయిన నుదురు, విశ్వకవి, అతను. విరాట్ పురుషుడు. ఆ విరాట్ పురుషుని ముందు, ఆ సాలప్రాంశు శుభ్ర వ్యక్తిత్వంముందు ఏ కవి నిలబడ గలుగుతాడు ? నిలబడి ఆయన పూర్తిరూపాన్ని ఊహించి అనువాదంకూడా

చేయగలుగుతాడా! ఒక మహా విశ్వసంగీతాన్ని గర్జించుకుంటూ పోయిన ఆ ప్రావృణ్మేఘాన్ని పట్టుకోవడం సంభవమా! దాని నీడలైనా చేజిక్కుతాయేమో లేదో! అనువాదమంటే ఒక్క భాషను చేయడమే కాదు మరి. కవి నిట్టూర్చిన ధ్వని, ఆయన నవ్విన చప్పుడూ, ఆయన గొంతులో సన్నని గీరలూ వినపడేటట్టు చేయాలి. గీతాంజలి అనువాదం మరీ కష్టం.

గీతాంజలి నిజానికి దేశప్రజలకంటే ముందుపుట్టింది. అప్పుడు ప్రపంచం ఎలావుందో, మానవునిలో ఎలాంటి కొరత ఏర్పడిందో గీతాంజలి దానిని ఎలా తీర్చిందో తెలియదు. ముక్కిపోయి ముంజూకంపు కొడుతున్నదేమో ఆనాడు మానవసంస్కృతి. దానిమీద గీతాంజలి మెత్తని మాంసం చల్లి, చందనం, కర్పూరం పూసి పరిమళింపజేసి వుంటుంది. ఆ కాలం గడచి పోయింది. ఇప్పుడు మానవుని వీపుమీద ఫెళ్ళున ఎండకాస్తుంది, ఆ కర్పూర మంతా కరిగిపోయింది. దాహం, దప్పిక, నీరు, ఇది మిట్టమధ్యాహ్న వేళ. ఈ యెండలో నుంచొని నేను దాహం అంటున్నాను. రవీంద్రుడు జలా శయం కాదు. వెన్నెలవాక. ఆయనదగ్గర అమృతం వుంది. కాని నాకు మంచినీళ్ళు అవుతున్నాయి. అయినా ఆయనదగ్గరకు వెళుతున్నాను. నా రుచి, నా పిపాస వేరు. నేను జీవనమధ్యాహ్నంలో ఉన్నాను. రవీంద్రుడు నేకుమరీతి. ఆయన చిదానంది. నేను స్యాద్వాదినికూడా కాదు. ఆయన శాశ్వత కాయుడు. నాకు 'శాశ్వతాల దైర్ఘ్యంలో ఉపయోగమనేది తక్కువ' ఆయనకు యీ లోకం చివర కొనఊగాలి అలల్లో ఆవలి దూరస్థగీతి విని పిస్తుంది. నాకు 'అడలి కొక్కొక్కోకో యని ఆకలితో కూసే కోళ్ళ' వక్రకంఠం వినిపిస్తుంది. ఆయన యింద్రియసౌజన్యం అది. నా దైన్యాను భూతి యిది. నిజానికి ఆయన 'సత్యం'తో నేను ఏకీభవించను, ఆయనలోని 'శివం' తో కొద్దిగానూ, 'సుందరం' తో ఎక్కువగానూ, ఏకీభవిస్తాను. మానవుడెప్పుడూ కొన్ని అంగీకారాలతోనూ, కొన్ని అనంగీకారాలతోనూ జీవిస్తూ వుంటాడు. పూర్తిగా అంగీకారాలతో బ్రతికితే మతంలా గుడ్డిగా చచ్చిపోతాడు. అలాంటి సత్యసంహారకాంగీకారంతో జీవించడ మెలా?

కాని రవీంద్రుడు సమగ్రమైన కవి. లోకానికి ముముక్షువు కూడా అయితే కావచ్చు. కాని నాకు మాత్రం కేవల కళాస్వరూపుడు. ఆయనలో ద్వంద్వాతీత, కళాసంవిత్తి, సహితానాంభావమూ వుంది. అందుకే గీతాంజలి చేశాను.

ఆయన కవితలో అన్ని యుగాలకు సరిపోగలిగిన మానవుని అంశం కూడా కదులుతూవుంటుంది. ఇదే ఆయనలోని స్థిరత, నిత్యత. ఆయనకళను విశ్లేషించినకొద్దీ ఆయన నిత్యత మనకు రకరకాలుగా **కనిపిం**చుతుంది. మానవుని లోని మానసిక ప్రపంచాన్ని, అతని నిర్మాణం, లయింపునూ సునితంగానూ సుకుమారంగానూ చిత్రించాడు రవీంద్రుడు. ఆ వర్ణనాభంగిమకు అంతకూ జవాబుదారి గత మానవుని సాంస్కృతి కోపలబ్ధి. భారతీయుని మజ్జాతంత్రులలోని ఊర్ధ్వశక్తి, కల్పనాబిబ్బోకము సదసచ్చుంబనము, ఒక సన్నని మిహిక, దాని పరివేష్టనం. ఒక అనంతశక్తిముందు సర్వసమర్పణ బుద్ధితో మనం వంగి వున్నంతవరకు, మన తృష్ణలు ఒక మాయగా వచ్చి మనకు తెలియకుండా మనను చుట్టివేస్తున్నాయనే తాత్త్విక కల్పన మనలో మెదులుతున్నంతవరకు ముక్తి, నిగ్రహము, ఆత్మత్యాగము లాంటి పదాలకు క్రొత్త నిర్వచనాలు వచ్చి అవి మనలో జీర్ణింపబడనంతవరకూ, అంతమేరకు రవీంద్రుడు శాశ్వతకాయుడు. అతని అంతర్జగత్తు వొక కాల్పనిక సత్యం. ఆ కల్పనలో వున్న మనుగడ శాశ్వతమైన మేరకే. ఆ కవికూడా మనకు శాశ్వతుడౌతాడు. పోతే రవీంద్రుడు దేనిని నశ్వరమని యీసడించుకొన్నాడో దాంట్లోనే ఆయన నిత్యుడు. అతృష్ణాప్రపంచంలోనూ, దానిని చిత్రించడంలోనే ఆయన నిత్యత, సజీవతలున్నాయి. మానవుడు ఉన్నంత వరకూ అతని శత్రువులైన యీ యింద్రియాలు అతిమైత్రితో అతనికి సపర్యలు చేస్తూ వుంటాయి. అతని ముక్కూ, కన్నూ, చెవీ, అతను వద్దన్నా అతని కెన్నో నేర్పుతాయి. హృదయం, ప్రేమ, నిట్టూర్పులూ, అతనితో వుంటవి. ఇవి చిరసత్యాలు. వీటిని మనోహరంగా చిత్రించాడు రవీంద్రుడు. అందు

వస్తే ఆయన శాశ్వతత్వమేమిటో. ఆయన సౌకతాకికం, ఆయన కళాసంబంధా నందం బికొత్తాయి. ఈ పద్యాలు రూపంగా గీతాల్లోనే జకజకా చిమ్ముకు పోతున్న గంభీరమైన ఆకృష్టత, ఒక స్థాలిత్యంగానూ, శైథిల్యంగానూ, అల్పమైన మట్టిపోస్తున్న నిగళంగానూ, ఆస్త్రవాదికి కనుపించవచ్చును. గాని వాస్తవికంగా అవి అలాంటివేమీ కావు. అవి వాంఛనీయమైన సత్యం. ఇలా చెప్తే దాని విశ్వ స్వరూపానికి, లోకం గజగజలాడిపోతుంది. ప్రత్యామ్నాయంగా ఒక ఆశ్చర్యజనకమైన 'శాంతి' ఏర్పడేవరకు, వెనుకటి వరవడిలోనే బద్ధకంగా జారిపోవాలనుకుంటుంది. అందువల్ల యీ 'పవిత్ర పాపాల'ను మనం వేచే మార్గంలో ప్రసేకరించుకోవాలి. అలా చేయాలంటే మనం మన భావాల దగ్గరనుండి కాకుండా మన భావాలను రూపొందింపజేసిన అట్టడుగు జీవన ప్రాతిపదికల దగ్గరనుండి మారుతూ రావాలి. అప్పుడే రవీంద్రుని కవిత ఇప్పుడు మనమనుకుంటున్న విలువలతో శాశ్వతం కాకుండా యింకో విలువలతో శాశ్వతమౌతుంది. అప్పుడే ఆయననుంచి మనం సరైన స్ఫూర్తినీ, చైతన్యాన్నీ పొందగలుగుతాము. అప్పుడే 'తృష్ణను గర్హించకుండా తృష్ణను సగం చేసి పంచే' న్యాయం కోసరి తహతహలాడుతాము.

రవీంద్రుడు తత్త్వవేత్తగా యీ సృష్టిని కాదనలేదు. అలా కాదన్నే తాత్విక నిష్ఠకూడా ఆయనకు అవసరంలేదు. ఆయన కవి. కవిగా మాత్ర మీ సృష్టిని కాదంటున్నాడు. అంటే కాంతా సమ్మితంగా, ప్రియురాలి క్రేగంటి చూపుల అనంగీకారంలో వుండే అర్థోక్తిలాంటి దేదో ఆయన కావ్యంలో వుండి సృష్టి మమకారాన్ని వొలకబోసుకుంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే లోక సౌందర్యాన్ని మాపుచేయని అతిలోక కవి రవీంద్రుడు. ఎంత వద్దన్నా అతిలోక కవిలోకూడా వాస్తవికత వుంటుంది. వస్తువాదీ, భావవాదీ యిద్దరూ కవులుగానే జీవించగలిగితే వాళ్ళెంతటి వాళ్ళే ఎవరికి వాళ్ళు తెలియకుండా ఒకరిసరసన ఒకరు వచ్చి కూర్చుంటారు ఒకే సమతలంమీద! అదే కళ, అద్వైతభావన. కళాస్రష్టలోని వైరుధ్యం నిష్కామమూ నిర్మలినమూ

కానడంవల్ల అది మనకు ఆకర్షణగానూ అనసూయగాను అవుతుంది. ఇలాంటి సంబంధమే ఏదో దక్షిణానిలంలాగా వీచి నన్ను గీతాంజలికి ప్రేరేపించింది. రవీంద్రునకు తన ప్రభువు లీలామానుష దేహుడు. నాకు రవీంద్రుడే లీలామానుషదేహుడు. ఆయన స్పర్శానుభూతినిలోంచి స్పర్శసుఖం, రూపానుభూతినిలోంచి రూపమాధుర్యం పొందుతున్నాడు. అలాగే నేనూ రవీంద్రుని ఆత్మసమర్పణ గేయాల్లోంచి స్వాత్మనిరూపణనూ, అపౌరుషేయాన్నుంచి పౌరుషేయాన్ని పొందుతున్నాను. సృష్టి అనే యవనికమీద ఆయన ప్రభువు ఎన్నో చిత్రవిచిత్రములైన రంగులు గీశాడు. నాకు గీతాంజలిలో నానారకములైన రవీంద్రుని క్రీడలే కనుపించుతున్నాయి.

ప్రస్తుతానువాదంలో గీతాంజలి గేయాలు నా హృదయానికీ, చెవికీ ధ్వనించిన రీతిలో పలురకాలుగా చేశాను. పాటలు, గేయాలు, పద్యాలు, గద్యరీతులు యిలా నాకు వీలయిన పద్ధతుల్లో. రవీంద్రునిలోని గాంభీర్యాన్నీ మార్దవాన్నీ తెలుగుగేయాలుగా తీర్చడానికి నా రూక్షకంఠాన్ని ఎంతో వంచాను. షడ్జం మ్రోగే నా వీణమీద ఆయన కాకలిని ధ్వనింపచేయడానికి చాలా శ్రమించాను. ఒక్కొక్క సమయంలో ఆయన 'గేయంతో నా గేయాన్ని కలపడానికి నావాక్కును పెకలించగా అది మధురమైన గేయం కాకుండా పోయి చిరుగ జీరవారి బిగ్గబిగిసిపోయిన' స్థలాలుకూడా వున్నాయి. ఏమైనా నాగూటిలో అట్టడుగున గడ్డగట్టుకొనిపోయి వున్న మెత్తని స్వరాలు గీతాంజలి సహాయంతో కదలించి కొంచెంగానైనా పిల్లం గ్రోవిలా పలికింప జేయగలిగాను. గీతాంజలిని అనువదించి నా శిల్పాన్ని సంస్కృతీకరించుకున్నాను. నా వాఙ్మతను చాంద్రీకరించుకున్నాను. పెద్ద వటవృక్షం నీడక్రింద ఒడలుమరచి కాసేపు కూర్చున్నాను. అది ఒక చల్లని నీడ, విశ్రాంతి. ఒక నిట్టూర్పు.

'అనంత పథాలకు తెరచాపలెత్తుక వెళ్ళే పడవలు,' 'జలకుంభాలు తొణికించుతూ పోయే పల్లె పడుచులు,' 'విశ్వసభా ప్రాంగణంలో తన

వీణను మ్రోయించుకొనే కుతూహలం,’ ‘తాను అడవిమొగ్గలా విశ్వరహస్య క్రీడావనాన వికసనం.’ ఇవన్నీ చూస్తూంటే, నిజంగానే ఒక చల్లని నీడలో కూర్చున్నట్లనిపించింది నాకు. విశ్వకవి ధన్యుడు.

చూస్తూచూస్తూ నేనుకూడా నా శైశవంతో ఆ అనంతపథాల బడి అల్లిబిల్లిగా పరుగెత్తాను. అల్లరిమాత్రం చేయలేదు. ఒకవేళ చేసినా ఆయనే నా భుజంతట్టి బుజ్జగించి మళ్ళీ తన వెంటబెట్టుకొని తీసుకొని వెళ్ళాడు. ఎక్కడికీ? ఎందుకు? అని నే నడగలేదు. పిల్లవాడిలా వెళ్ళిపోయాను.

—అనువాదకుడు.

## ౧

అపరిమేయు జేసి నన్ను
ఆనందించినావు ప్రభూ !

రిక్త మొనర్చి మరల మరల
నింపుదు వీ జలపాత్రిక
కొంగ్రొత్త జీవనమ్ము బోసి
చిన్నారి మురళిదీసి దీని, ను

త్తుంగ గిరుల వనుల ద్రిప్పి
ఏ వేళకు మాయని తీయని
సంగేయ స్వరము నింపినావు

నీ అమర్త్య కరచాలనలో
పొంగిన నా శిశుహృది
ఆనందపు టొడ్లు విరిచి
ఉచ్చరించి నవ్యకొనిమె
నా చిరు వ్రేళుల జారుచున్న

నీ కాన్కలు అనంతాలు
యేండ్లు పూండ్లు గడచె, నీ
చే యలయదు, నా
కడ చోటున్నది

అపరిమేయు జేసి నన్ను
ఆనందించినావు ప్రభూ !

—□—

౨

గానమ్ము జేయమంటి వపుడు
నా హృది గరువాన పొంగె
నీ మోమువంక కన్ను వంచి
చూచినాను కన్నీరు లొలికె

నా కర్కశ నిస్వర రుతులన్నియు
కరగెను నీ సుధాస్వరమ్మున
సాగర నభోడ్డీయమాన
ఖగము పోల్కి ఱెక్క లల్లార్చెను
నా ఆరాధన — నీ
కెలమి గూర్చుచుంట గదా !
నా గానమ్ము సదా కేవల వాగ్గేయ -
శిల్పినై స్వామీ ! నీ కడ కేతెంచితి

వ్యాపించిన నాగాయన
పక్షాంచల చుంబనాల
నందుకొందు నీ అడుగుం దమ్ముల
కాని మ్మవి నా కందనివే.
నా గేయానంద స్వరధునిలో
ఒడలు మఱచి పిలచినాను
సఖుడా ? యని సంభ్రమాన
ప్రభువేను 'మాటమఱచి

గానమ్ము చేయమంటి వపుడు
నా హృది గరువాన పొంగె
నీ మోము వంక కన్నువంచి
చూచినాను కన్నీరు లొలికె



## 3

ఎంత మధుర మీవు పాడు గీతికారవమ్ము ప్రభూ!
వీనులొగ్గి వినుదును మౌనముగా కడువింతగ

నీ సంగేయ సుఖము సుఖింపజేసె విశ్వరమను
గగనాంత ర్గగనాలకు చెంగలించు, నీ
రాగస్వన జీవద్ ప్రాణఘోష
శిలోచ్ఛయాల అతికర్కశ బంధనాల
త్రుంచి పాఱు నీ స్వరస్వనిత వేగధార
వెంపరలాడును నాయెడంద లయించిపోవ నాసప్రభూ!
పెకలింతు గొంతు, ఘూర్ణించుచు నా వాక్కును
గేయము కాదేలకొ నా రూక్షగళము
చిత్రున జీరవారు బిగ్గబిగసిపోవును
నీ అనంతస్వన వాగురాల బంధించినావు నా సకలమ్ము
ఎంతమధుర మీవు పాడు గీతికా రవమ్ము ప్రభూ !
వీనులొగ్గి వినుదును మౌనముగా కడువింతగ



౪

నీ చిద్విలాస స్పర్శమేన కలయ
దివిరె మలిన మంటనీను ప్రభూ !
స్ఫటికమాల పోలె నుందు

రుచిరస్నేహ దీపికా -
ప్రకాశ కిరణమిచ్చినావు
వివేక మిఱుతటాల పొంగె
అసద్విచార మంటనీను

నీ మనోజ్ఞమూర్తి నిలిచె
నా హృదంతరాన — పాప
వాపిలోకి జాఱిపోను,

నీ ప్రేరణాంచలాల బట్టి
పోవుచుంటిగాన నిన్నె శ్వాసలం
దిమిడ్చి సర్వకార్య విధుల
అభివ్యక్తీకరించు కొందు.



౫

నీ చేరువ నొక్క లిప్త
విశ్రమింతునా ప్రభూ !
పై పై బడు పనులు వేలు
పిదప జూచుకొందు గాక
తృషిత మనసు వేగిరించుచున్న
దీ కనుల కింత చాటుగాకు.

నీవు వినా భువన ఘోష
కూలహీన జలధి నాకు
కబళించు వెడద నోటివోలె
నా ప్రాంగణాన విరిసె పూలు
వాసంత గీతి పాడె భృంగి
మంజరీ కుమారి మ్రోల.

వెల్లుబుకు గుండె నిలిపి మ్రోల
ఆలపింతునా సఖా !
జీవన నైవేద్య గీతి
స్వచ్ఛంద బంధ గేయరీతి.
నీ చేరువ నొక్క లిప్త
విశ్రమింతునా ప్రభూ

—□—

## ౬

ఈ సుమవృంతాల త్వరగ
చిదిమికొమ్ము, తొఱగిపోక మున్నె

నీ మాలా పల్యంక డోల నీ
బాలల కేమో తావున్నదో మఱి లేదో
నీ స్పర్శాంచల సుఖమైన పోనీ
జాలువారనీయ రాద !

తడయకు మిది వేళగాదు
పగలు గ్రుంకె పొంచుచున్న
వీ చీకటులూ —
పూజవేళ చే జారిపోవు
వెఱపు నాకు చిదిమికొమ్ము
ఈ సుమవృంతాల త్వరగ

ఓ సజల కాంతి లేశమో
మరంద సురభి శేషమో
లవలేశ మున్న గాని
పూజకొనల చివర చెదరి
అరనిమేష మున్నగాని

ఈ సుమవృంతాల త్వరగ
చిదిమికొమ్ము, తొఱగిపోక మున్నె

—□—

## ౮

అలంకృతుల బరువు లోల్చి
నాను నాదు కృతులకు

దుకూల శోభసైతమేల ?
వ్యర్థభార మెందుకులే
ప్రస్థాన సుఖద రమ్యవీథి
మహామిళన వేళ వద్దు
భూషణ ఝుంకార ఘోష
విస్రంభ మధుర మంద్రగీతి
అణగునేమొ నాకు భీతి

కవిగా నా అహం బుద్ధి
కరగనో మహాకవి !
మస్తకాన్ని వంచినాను
సులభీకరించు జీవితాన్ని
మురళి జేసికొమ్ము నన్ను

స్వనించిపోదు నీ మహారాగ గీతి
నా జీవన నవరంధ్రాల నింపి

అలంకృతుల బరువు లోల్చి
నాను నాదు కృతులకు



౮

క్రీడించలేదు పిల్లవాడు
పరిధాన భార సంభ్రమాన
కేయూరహార కుండలాలు
ఆడలేదు బంధనాలు

ఈ కౌశేయ శుభ్రరాశి
ఈ సురమ్యరత్న రాజి
కగ్గిపోవునన్నభీతి
పరిష్వంగ సుఖదక్రీడ
ఆడలేదు - బంధనాలు

ఈబంధనాల శింజినిలో
బంధించబోకు వద్దు వద్దు
నీ నిసువుల కీశృంఖల
రత్నఖచిత భవ్యకాంచి
కీలించబోకు వద్దు జనని !

విపణులలో, వీథులలో
నడిఎండన, ధూళిమీద
నానాజన సందోహ జలధి

వీచికలో ఆడనిమ్ము
నురగలబడి తేలనిమ్ము
కకుభంతరాంతరాలనుండి
వీచుధ్వనుల నోరయనిమ్ము

ఈబంధనాల శింజినిలో
కీలించబోకు వద్దు జనని!

—□—

౯

నీ భుజస్కంధములపైకి
జడుడా ! నీవే ఎక్కుచుంటివా !
నీద్వారముకడకు నీవే
బిచ్చమునకుగ వచ్చితివా !

మోపుమతని భుజాలపైన బరువు
మోయగలడో యీసమస్తమెవ్వడు
వెనుదిరిగికూడ చూడడో వెతబడి.

నీతృష్ణానిలాలు ఆర్పుచున్న
వా దివ్వెను గుప్పుగుప్పున
మలినములవి ఆమలినాంచలాన
ఉపాయనమ్ము దీసికొనకు
పునీతప్రేమలబ్ధినే గ్రహించు.



పతితులు శ్వ స్వజీవనుల
భాగ్యులు తాడితు లార్తమానవుల్
గతిసెడి యున్నవాడ లవి
కాంచితి నమ్యోడచే భవత్పదాం
కిత చిరముద్రికల్ శిరమె
కింత నతంబగు నట్లు జేసి వం
చితి మెయిదీవయున్ ప్రభుడ !

చిత్రము నానుదురంత కేనియున్
హత్తుకొనంగ లేదు భవ
దాచ్ఛపదాబ్జ పునీత పీఠమా
యత్తసమస్త సత్వగర
ళాయిత గర్వుడనైతిగాన ని
ర్వృత్తిసుఖప్రదా! హృది ద్ర
వింపగలేను ధరాతలాన, నీ
యుత్తమ నమ్రతావధి స
ముత్సుకమై ప్రవహించుస్థాయికిన్.

ఈ నా కన్నులు గర్వమంధరములై
ఎట్లేగు నా శోషణ

క్షీణానేక కుటీరభూముల ప్రభూ !
శ్రీరమ్య హర్మ్యాంతర
క్షోణీవీధుల గానుపింపవుగదా !
శుష్కప్రజా పీఠిపై
తూణీరం బయిపోల్చు నీ యభయమే
దుర్వృత్తి నేఁబొందుదున్.



భక్తి, భజన, పూజ, సేయనేల !
అపనయించుమా అర్చకా !
గడియవైచి ఏలనోయి కోవెలలో
రసహీనపూజ ! పాలరాతి
ప్రోల, మూలనొదిగి యిట్టుల
ఇరుల నెడదవై కిలాగి చీకటి భావిలోన
వోలె కూరుచుంటి వేడుగలచి

రెప్పవిచ్చి చూడు, దేవు డీజగత్త్రాత ప్రోల
నేల సర్వ్రీకరించి సాగుచేయువారలు
నాటు మృత్తి నొడిచి బాటవేయువారలు
వారినడుమ కేగినాడు నీప్రభువు దేవుప్రోల

వలువలొలిచి వారిగలసి యుండె
మృత్తిశిరలలో, స్వామిగలియవేడ్కయేని
పునీతాంబరాల నవలద్రోసి
స్వామివోలె ధూళులలో కలసిపొమ్ము

ముక్తియెచట ! ఏగూటిలోని పులుగుపిల్ల !
సృష్టిబంధనాలనేడు స్వామిగూడ

చిక్కకోనియె మనచుట్టునంటి తిరుగుచుండె
మమతా రజ్జుల పెనగి పెనగి.

ఈపూజోపహార చయము
ఈభక్తి భజన జపతపమ్ము
అపనయించుమా అర్చకా !

దువ్వలువ మురికిదైన నేమి
రవంత చినిగి పోవ నేమి
వెళ్ళుమచట ప్రభువు పజ్జ
నిలుచుండ నీదుకోర్కెయేని
మురికి, దుమ్ము, బురద, మట్టి
పరిమళించు ప్రస్వేదకలిత
పృథ్వీవఱకు సాగుము నీస్వామిదరికి
భక్తి భజన పూజసేవలేల?
అపనయించుమా అర్చకా !

— □ —

## ౧౨

నే వసంత కాలయాత్రిని
నే నతిదీర్ఘ మార్గగామిని
జ్యోతిర్నవ కిరణాలతోంటి
అరదమెక్కి అరుదెంచితి

భూ నభాలు చుట్టిచుట్టి
పదముద్రిక లెన్నో పఱచిపఱచి
గోళాంతర్గోళాల నడుమ
జ్యోతిర్నవ కిరణాలతోంటి
అరద మెక్కి అరుదెంచితి

కడు ప్రయాస దూరత్రోవను
స్వయం నీకు నికటమగును
అత్యంత కఠిన శిక్షణకళ
స్వరసరళతకై అనువుజూపు
తెరువరి పరగృహములెన్నో
తొంగిచూచు స్వగృహముజేర
భవదభ్యంతర మందిరాన
అడుగిడ నెన్నో వెదకినాను
బహిర్ద్వార గోపురాలు

ఈ కన్నులు లేడివోలె
గాలించివచ్చె మన్ను మిన్ను
అంతలోన కన్నుమూసి
అంటి కడకు 'నీ విక్కడ' !

ఘూర్ణిల్లిన దొక్క-అరప్ర
నీ వెక్కడ అన్న ప్రశ్న
వెల్లువైన చిగుపలై
కన్నీ సెలు శతముఖాన
ప్రపంచాన్ని ముంచియెత్తె
'అహమస్మి' యన్న సాంద్ర
ప్రతీత్యోర్మి వాహినిలో.

—□—

౧౩

నా హృదయగీతి ఇంతకూ
పాడలేదు ప్రొద్దుపోయె

ఈ వీణాతంత్రిక లొకటి
నొకటి పెరసి కొనియె
స్వరము గలుపు కొనుటలోనె
కరగిపోయె కాలగతియు
తేనెలొలుకు నుడులు లేవు
పాట లయకు రాదు నాకు
నా హృదయవ్యథలు పెదవిచివర
నా ప్రాణగీతి నాకడనే నిలిచిపోయె

నా హృదయగీతి నింతకూ
పాడలేదు ప్రొద్దుపోయె

కుడ్మలాలు విరియవేమి
వేడికసరు గాలిలోన
ఊళపెట్టునో కకుభంతరాలు
ఎవరో మరి వీధిమొగల

నడయాడుచు పోవుచూ
వినిపించదు పీయూషవాణి

పదముద్రల సవ్వడియే
ఏమేమో లీలగా—

నా హృదయగీతి నింతకూ
పాడలేదు ప్రొద్దుపోయె

సెజ్జపరచు నంతలోనె
వ్రాలిపోయె పాడుదినము
వెలిగించనైన లేదుదివ్వె
ఏచనువని పిలతునింక

ఆ కౌగిలిలో మునిగిపోవ
ఎన్నినాళ్ళ తలపిదో
వీధిమొగల సవ్వడిలో
ఇంకెన్నినాళ్ళు ఉలుకుదునో

నా హృదయగీతి నింతకూ
పాడలేదు ప్రొద్దుపోయె

—□—

## ౧౪

తృష్ణానిలాన్ని చిమ్ముకొంటి
వెల్లడపుచున్న వేదయజపు
సదా నిరాకరించి నన్ను
పరిష్కరింప నీమనోర్కె
నీ కఠోర కరుణాలేక
స్వయం భస్మచితినికాన

శరీర నభఃకాంతి మనః
ప్రాణచయము ఇచ్చినావు
అంతస్సుస్థ లాలసో
ప్రదవమ్ముకుండి వేపరచు
జేవ్వరించు కనుగవతో
మేలుకొంటి సగమువాడి
మరల మరల పయనించితి
అన్వేషణాను రక్తినాకు

నిర్మోహీ! క్షణము ముందు
మరోక్షణము చాల
కానుపింపవేల ఓహో!
తెలిసె నాకు నీదుక్రీడ

నిర్బలేంద్రియాల ఎండ
మావినుండి లేపినన్ను
సంస్కృతీకరింతువో
మహోమిళన వేళకొఱకు

---

## ౧౫

నీ విశ్వసభా ప్రాంగణాన
ఒదిగి కూరుచున్న నన్ను
యశోగీతి పాడనిమ్ము

ఈ సంకుల సంసృష్టినడుమ
నాకేమి తెలియు నర్చకుణ్ణి
క్రియాశూన్య తంత్రులనే
కదుపుచుంటి ప్రాణానిలాన

అర్ధ రాత్రి వేళ శిథిలసృష్టి
తంద్రాలస కంపన లోగాని
డోలాయించు వేళ
నీకై హారతు లెత్తు వేళ
ఎదుట నిలిచి పాడనిమ్ము

నన్నుకూడ స్వరముగలిపి
పాడనిమ్ము వేకువలో
సౌవర్ణ వీణమీటు ఉషసు
లోన గలసి పాడనిమ్ము

నీ విశ్వసభా ప్రాంగణాన
ఒదిగి కూరుచున్న నన్ను
యశోగీతి పాడనిమ్ము

—□—

౧౬

నీ విశ్వ వైభవోత్సవాల
పాలు గొందు పిలుపువచ్చె

నీ కాంతి జూచి మధువు గ్రోలి
దోగిపోదు బాష్పవారి
వేణువు మీఁదు కలన
నా కొసంగినావు, నా
హాసన రుదన సాంద్రతలో
నల్లు కొందు గీతమాల

నీ విశ్వ రాజితోత్సవాల
పాలు గొందు పిలుపువచ్చె

వేళ సమాసన్నమాయె
వీనులొగ్గి జయఘోషకు
మూక ప్రణతి జేసి నీకు
ధన్యదేహి నగుదు ప్రభూ !

నీ విశ్వ వైభవోత్సవాల
పాలుగొందు పిలుపువచ్చె



౧౭

ప్రేమవిపణి నమ్ముడుబో
వేచియుంటి నింతతడవు

ఒకింత విలంబమైనదేమొ
నా దోసగులోచ్చ కొనగలేవ !
నానావిధ కార్యపటలి
నా మాంద్యమల్ల జూచువారు:
ఆ యుపాసనాజటిలగ్రంథి
లోన చిక్కు బడుదునా
ప్రేమానిలాల తెస్ల ఖగిని
ఈ వాగురాల పట్టువడను

నిందించనిమ్ము వారియిచ్చ
ఉచిత మదియె నాకు కూడ
విపణి మూగవోయె, విక్రయ
క్రయోప జీవు లేగినారు
పశ్చిమాన నినుడు గ్రుంకె

ప్రేమవిపణి నమ్ముడుబో
వేచియుంటి నింత తడవు

—□—

## ౧౮

త్రోసాడుచున్న జలధరాలు
పురులు విప్పి పొంచె నిరులు
ఈ నిర్జన గృహ ప్రాంగణాన
నన్నేల నిల్పినావు ఒంటరిగా

ప్రత్యహము ప్రొద్దుబోవు వఱకు
తిరుగాడు చుందు వీథి వీథి
సహస్రజనుల నడుమ పెనగి
వ్యస్త కార్య సంభ్రమాన

నీ దర్శన వాంఛనుంటి నేడు
ఈ వర్షాగమవేళ, గ్రుడ్డిరేయి
నీ వూరడించకున్న ఎవరు నాకు
తిమిరాంచలాల బోదు నెటకు !

కనులు గ్రుచ్చి చూచుచుంటి నా
దూరస్థ నభము, పవనవీచి
దోగు ఘటల తేలి తేలి
పోవుచుండె హృద్విహంగి

ఈ నిర్జన గృహ ప్రాంగణాన
నన్నేల నిల్పినావు ఒంటరిగా
తారాడుచున్న జలధరాలు
పురులు విప్పి పొంచె నిరులు

— ◻ —

## ౧౯

పలుకవేమి
మౌనమా సఖా !

పోనీ నీ చిరమౌన గభీరగరిమనే
నింపుకొందు హృదయవీథి
ప్రతీక్షింతు నిర్నిమేష తారకా
విలోచనాలు విచ్చి రేయిలా

తమసు బోయి యుషసు విరియ
నీలి నభపు టెడద చీల్చునులే
నీ కల వీణాస్వర సంధానకలన
నీ శబ్ద రుతులు నాపులుగు గూండ్ల
కలగీతికలై మొగయునులే
మరల మరల సుమ మంజరులై
హసియించునులే
నా కుసుమవాటి

—□—

## ౨౦

పొద్దువాడిచి కెంపమ్ము విరియ
సంభ్రమించె నా యెడంద

రసహీనమ్ముగ నుండ నపుడు
విరికై మది మోహమ్ము లేదు
సుమచయనిక శూన్యమేను
సర్వము నా కనవగతము:

పుల్కుపల్కు అన్నయటుల
ఎద నేదో ఉదాసీన రేఖ
ఒక్కమ్మడి త్రుళ్ళిపడితి
కలనుండొక కొంతదవ్వ
మలయానిల మొండు వీచి
పుష్పాడి విరజిమ్మపోయె

ఆ మాధుర్యమ్ము తీవ్ర
తృష్ణాకులు జేసె నన్ను
పరిపూర్ణత నొందుకొఱకె
ఆమని నిట్టూర్పు బుచ్చె
ఈభావన నాలోనవిరియ
నాకా విరిదవ్వుల దోచ లేదు

ఊహించితి కడకది మద్హృది
లోతుల వికసించు కెందమ్మి సుమీ!
సంపూర్ణ మధురిమాగుణాన

—□—

౨౧

రేవువదలి పయనమింతు
గాలికి తెరచాప విడిచి

ఈ నీరస నిమేషాలబడలి
ప్రతీక్షింతు నెంతసేపు
ఆమని కుసుమాలు విరిసి
కాలజలధి గలసె నీ
రాలిన పుష్పాలనేరి
ప్రతీక్షింతు నెవరికోటకు

తరగలలో సుసులు మ్రోత
తటద్రుమాల గాలికోత
చిటపటమని పండాకుచొదల
సన్నని దేదో పులుగుకూత

నోసలువిరిచి నీవే
నిర్మేఘ శూన్యనభము
గాంచుచుంటి వీ
కొసరుగాలి అలల కలద!
ఆవలి దూరస్థగీతి
ఉల్లాస మధుర కంపనలో

రేవువదలి పయనమింతు
గాలికి తెరచాప విడిచి

—□—

## ౨౨

**ఈ** వేకువ, శ్రావణమాసాలవేళ
నీలిమొయిలు నీడలలో
అడుగులసడి కానీయక
ఈ కనుల బ్రామి ప్రామి
యేదెస పోజూతువోయి సఖా !

ముకుళించె నేడు ఉషసుమోము
ప్రాచినుంచి వీచుగాలి
వెఱ్ఱి కేక లిడుచున్నయటుల
నవ్వ్యాకునే పెదవిమీద
నభము లాగికొనియె ముసుగు

మూగివడిన తరులు గిరులు
మూయబడిన తలుపులలో
పౌరనివాస్థలులు, కుటులు
మాటుమణాగియున్న నగరు
వాకిట—ఎవరికోస మీ ప్రతీక్ష

రమ్ము సఖా! నా గృహద్వారము
ఎదురుచూచు నీకోసము
స్వప్నరమణి వోలె నన్ను
గికురించబోకు, రమ్ముసఖా !

ఈ వేకువ శ్రావణ మాసాలవేళ
నీలిమొయిలు నీడలలో

—□—

## ౨౩

ప్రాణసఖా !
ఈ నిబిడ నిశా
వలయములో నీ ప్రణయయాత్ర
ఎటకోయీ !

నిరాశవోలె
పెద్చుచున్న దభ్రపథము
కనుల నిదుర లేమి
అర మోడ్పుగ
వ్రాల్చి తలుపు విన్నుచుంటిని
నీ సవ్వడి

వ్యాకులించె
హృద్విహంగి
పథము బోధపడదు నీ
ప్రణయ యాత్ర
ఎటకోయీ !

ఏ తమాల
నదుల నుండి
ఏ సుకుమారగహనవనుల ఏతమ
స్థిమిత గిరిలోయల
బడి పరుగిడితివి
నీ ప్రణయ యాత్ర
ఎటకోయీ!



ఈ దినమ్ము జారిపోవ
ఖగకులమ్ము నవముమాన
అలసి గాలిగొంతు ప్రీల
పుడమి కనుల నిదురపలువ
దించినటుల నిండుగా
నిశికాగా కెందమ్మిరేకు
లొయ్యారముగా ముడిచినటుల
నిబిడాంధకార నీలశాటి
నాపై మెల్లగ వ్రాల్చరావ !

ఆబాటసారి మేనప్రాత
చిరిగెను జిరాకులయ్యొ
అతనియాత్ర ముగియలేదు
పాథేయ మపుడె రిక్తమాయె
ధూళిధూసరాలు కాళ్ళు
శిథిలాంగకాలు వాని జీరి
నిరుపేదతనము తుడువరాద
లోలో గలంచు పీడ మాన్చి
నవచేతన నీయరాద

కరుణామయి కేయిరాణి
పూమొగ్గల కిడిన చాయ
లోలో కలంచు పీడమాన్చి
నవచేతన నీయరాద.



## ౨౫

అలసిన యీ నిశిలో
నీకడ పాథేత మునిచి
అళుకు దక్క నిశ్చింతగ
నీచేరువ శయనింతునా ప్రభూ!

నా శిథిలావయవాలు ఇఱుగెలకుల
విరజిమ్ముకొందు సోలిపోదు
ఈనిముసాన సేకరించలేను
నీపూజా ద్రవ్యోపహారచయము
ఒడలు తునియ లగుచునుండె

నీవేగద యినుని నడలు
బరువుగ వ్రాలిన కొండనుండి
సైచలేక చేజార్తువు
వాసరావసాన నీలివలువ
వేకువకాగా నుద్గమించి
నడిపింతువు కిరణాలబాట
స్ఫురద్రూప కాంతులలో

అలసిన యీ నిశిలో
నీకడ పాథేయ మునిచి
అళుకు దక్క నిశ్చింతగ
నీచేరువ శయనింతునా ప్రభూ!

—□—

## ౨౮

నాకనులు మునిగె నిదురడోల
ప్రియుడు వచ్చి నిల్చెకడల
లేనీడ పడిన ఆనవాలు
మునిగియుంటి గ్రుడ్డినిదుర

సడిచప్పుడు లేని రజని
సడి గానీయక వచ్చె ప్రియుడు
కలవేణువు నూదుచూ
కలలతీవె కదుపుచూ

నా నిదుర గ్రోలె వాని శ్వాస
నే కనులువిచ్చి చూడనైతి
ఈరీతి నేల కటికి రేయి
చేజాఱి పోవుచున్నవో

నాకనులు మునిగు నిదురడోల
ప్రియుడు వచ్చి నిల్చెకడల
లేనీడపడిన ఆనవాలు
మునిగి యుంటి గ్రుడ్డి నిదుర

—□—

## ౨౭

ఓ ప్రకాశ కిరణమా !
ఓ ప్రకాశ పుంజమా !
ఎటనుంటివి నీ తావెయ్యెడ ?
జ్వాజ్వాల్యమాన తృష్ణాగ్నుల
దానిని వెలిగించుమా !

ఈదీపిక లిన్నినాళ్ళ
కొక్కసారి వెల్గెనా
దుర్విపాక దగ్ధమా
'ఛీ' ! పగులవేమి ? హృదయమా !

నిరాశమూతి తలుపుదట్టి
పిలచునేల నన్ను గ్రుచ్చి
నాకొఱకు ప్రియుడు వేచియుండె
ఈనిశిలో నను గలియనంపె

జలధరాలు మింట గ్రమ్మ
క్రమ్మరించె గుబురుజల్లు
తెలియరాని భావమేదో
వ్రేళ్ళూరికి పోయె గుండెలోన

చిమ్మ చీకట్లు జిమ్మ
క్షణక్షణద కళ్ళలోకి

నిశాగీతి పిలుచునటకో
ఆ బాటసరయు కాంతునాకు

ఓ ప్రకాశ కిరణమా !
ఎటునుంటివో తావెయ్యెడ !
జ్వాజ్వాల్యమాన తృష్ణాగ్నుల
దానిని వెలిగించుమా !

గర్జించుచున్న దళ్లి
ఇరమ్ము దమ్ము జీరి చీరి
వ్రయ్యోలయ్యో గాలిగొంతు
నల్లని నిశికారునల్ల జాతివోలె

ఈక్షణాలు తమసులోన
జాజనీక తిగిచిపట్టు
నీ జీవనమ్ముతో నులువెచ్చగ
వెలిగించుము ప్రేమదివ్వె

ఓ ప్రకాశ కిరణమా !
ఓ ప్రకాశ పుంజమా!



ఇవిదృఢమైన శృంఖలయ యేమయినన్ హృదితల్లడిల్లు నే
విదళన సేయబూనుతఱి, వెక్కసమైన ముదంబునాకు ము
క్తి దరిసెనం బనన్ మరల కించమొకింతగ గల్గునేల! అ
య్యది దరిజేరునన్న సమయాన త్రపావిఘురాత్మ హీనతన్.

నా సహజీవివీవు, రతనాల రుచి ప్రభ కీవు ప్రోది, స్వ
ర్ణాసన దివ్యరూపుడవు, నాకు వయస్యుడవై ననున్ మదా
వాసము నంటియున్న లఘువస్తువులన్ తొలగింపనేదియో
దోసముబోలు శంక మదిదోచు చిరానుగతాత్మ బంధుతన్.

ఇదినా దైహికజన్మబంధములు నా యీ జన్మతో ఘోరమృ
త్యువులై పాంసువులై పెనంగ నయినన్ దూరీకరించన్ ప్రభూ!
వివిధంబుల్ ఋణముల్ మదీయములహో! వే వేలునా
యోటముల్
వివశంబా త్రపలోన జీవితము నే వృత్తిన్ స్పృశింతున్ నినున్.

—□—

## ౨౯

నాపేరున పొదివితి నెవ్వానినో
విలపించుచుండె నాతడు బందీగృహాన
నలువైపుల ఘనకుడ్యాలనెత్తి
ప్రాకారమేర్చ శ్రమించుచుంట

నభము దాకుచుండె గోపురాలు
కాని వాని క్రీనీడలలో
రోజు రోజు మరుగై పోవు
చున్న దాంతరద్యుతి, చిద్రూపము

ఈ ప్రోన్నత కుడ్యాలజూచి
గర్వించుకొంటి నడుమ నడుమ
ఒక్కటియు బీటవోనిరీతిగా
మెత్తుచుంటి రంధ్రాలనింప మృత్తి

అలుకుచుంటి వివిధ లేపనాల
ఏతద్ నిర్మాణకలన మునిగి మునిగి
విస్మరించినాను నిగూఢతథ్య
మంతర్నిహిత సత్యమేదో



ఏడడ సముద్రి ఓంకాన, నిట్లు దలచి
జటిలలోహాము గరగి సమ్మెటల నడిమి
గొళుసు జేసితి నతికితి కొక్కెములును
కాని సర్వము ముగియించి కాంచసంభ్ర
మాన, తుది కది నాదు కంఠాన నుండె

— □ —

# ౩౨

నన్నుప్రేమించు మమతలు నన్నునొడిచి
పట్టి విశ్వాన కాని నీ ప్రణయరాగ
మవితరాస్వాద్య మద్భుత మాత్మదృఢత
నిచ్చి మలినేచ్ఛలకుగాక ఈ జగత్తు
కావలంచుట నిల్పు, నిష్కాముజేసి

కాని నాపార్థివాకార కఠిన మమత
అంత కంతకు దరిలాగి యనునయించు
వీడిపోవుమనని దాని వెఱపదేల ?
దినము దినములుడొల్లై ప్రతీచిలోకి
నీవ ఒక్కడ వాక వింత నెమ్మికాడ
వాత్మదర్శనం బీయవో ఆత్మసఖుడ !

కాని యరసితి నీలోని క్రాంతకరుణ
నేను పిలిచిన మఱచినా నీయనుంగు
ప్రణయదేహము నాకయి పరితపించి
నాడుప్రణయాన రమియింప నడచివచ్చు

—□—

## 33

నడచివచ్చిరి పెద్దలింటి గడపగడపకు
కలద! మొకమూల నొకచిన్ని కష్యాలు
దిమ్మ పడియుండు మరినాక లింకవేమొ
విరిచి నారక లబాసన కేమము
మాఱు మాటాడ కుండుము మాకు నిచ్చు
భక్తి తోడనె యుపేయుట ప్రాణముగని
ఘంటికలు స్రూయుతజి ననుకంప నిచ్చు
శేషభోజ్యము గొనిమె హస్తింతుమంచు
గొణిగినాకలు మఱవేము, క్షుద్రమలిన
వస్త్రధారులు కాము కవంత ప్రొద్దు
పోయె, మాచుచున్నంత సుహ్వాంగి త్రుటిని
ప్రబలులై పోయి దేవతార్చనల గూడ
దోచికొని పోయినారు విగ్రహములకట !

--□--

## ౩౫

ఎచట మనసు నిర్భయమో
ప్రోన్నతమో ఫాలపటము
నిర్నిబంధమో జ్ఞానకళిక
కౌటుంబిక కుడ్యాలలోన
సంస్కృతి విభజింపబడదో
సత్యతటిని ఎయ్యెడ
నిస్వనించునో కలకల
పురుష కార మెయ్యెడ
విజయమంది పూర్ణమగునో
పునీతవివేక నీరధార
శుష్కమౌఢ్య సైకత తటాల
నెక్కడ నోరయదో
నీ కరచాలితమై మానవచేతన
వ్యాపక భావాల సంసృజించి
ఉదాత్త క్రియల సవరించునో
ఆ స్వచ్ఛంద లోకాంచలాల కాంతుల
స్వామీ! నా దేశము వెలుగొందనిమ్ము

—□—

ప్రహరించు నన్ను నోస్వామి! నాహీనత
దుర్బలతయు తునా తుసలుగాగ
సుఖ దుఃఖ సంస్పృష్టి సులభీకరించుక
సహియించ దృఢతర శక్తినిమ్ము
నా ప్రేమవాటిని నవ్యసేవారస
స్వాదుతృప్తికి బెంచ శక్తినిమ్ము
ఆర్తుని లాలించి యహంకార దుర్నీతి
చరణాల కెఱగని శక్తినిమ్ము

నిత్య నూతన తుచ్ఛ సన్నికటకష్ట
సహన యోగ్యత లోనగూడ శక్తినిమ్ము
శక్తి నాకిమ్ము నా స్నేహ ఝురులునీదు
సరస పాదాల ప్రవహింప శక్తినిమ్ము

—□—

## 38

నా దేహము అలసిపోయె
నేను కోంటి నంత
నాయాత్రయు ముగిసిపోయె
లేదేమో యిక ముందుదారి
వ్యయమయ్యెను పాథేయకణము
ఏవట వృక్షపు నీడలలోనో
విశ్రమించుటే మంచిది అని

అయినా నా బ్రతుకులోని ప్రబలకాంక్ష
నీదరికి జేరు మన స్స్వరలు
ముగియలేదు అలయలేదు
రసనపై శబ్దము లేనప్పుడు
కుడ్మలించు హృత్తలాన స్వరవీచిక
గతపథాలు కరగు నపుడు
క్రొత్తదీవు లలరించును

—□—

## ౩౮

నీవేసర్వము నీవేసర్వము
ఘోషించుచున్న దంతరాత్మ
మిథ్యలు, చాటూక్తులు, సారహీన
బంధ రాలు నా తృష్ణలు
నీవేసర్వము నీవేసర్వము

తామసనిశి అంతస్థలి
ఉదయరేఖ దాగినటుల
ఈఘటాటోప యవనికలో
ఈమధుముఖ తృష్ణావలయములో
అట్టడుగున నీప్రీతిగాథ దాగున్నది
నా అంతస్థిత చేతనలో
కుయ్యాళించెడు
నీవేసర్వము నీవేసర్వము

ఝంఝూహతి శాంతిని కల్లోలపరచి
చిరశాంతినె కోరుపగిది
నావిప్లుతి నీప్రేమను ఘాతపరచి
మరల మరల కుయ్యాళించెడు
నీవేసర్వము నీవేసర్వము



## ౩౯

నాహృది ఎండి బీటలువారు వేళ
వర్షించుము నాపై చల్లని కరుణధార
సీగేయామృతాన ఆర్ద్రీకరించు
నాజీవన మాధుర్యము కగ్గువేళ

ముసిరి ముసిరి నన్నూపిరి సల్పనీక
ప్రచండోగ్ర ప్రాపంచికోర్ములు
బిగించివైచువేళ ఓ శాంతి దేవ!
శాంతిసౌఖ్య సుషమా హస్తాల
నాకడ కేతెంచుము

నాదీన భిక్షుకహృది బిక్కుబిక్కున
కూర్చున్నవేళ ఒదిగి ఒకమూఱుమూల
తలుపుబద్దలుగాద్రోసి ప్రవేశించు
రాజోచిత స్వర్ణ రౌప్యలాంఛనాల

నాతృష్ణలు హృదిని ప్రతారించి
నను మోహాంధుని జేయుతఱి
ఓచిత్ స్వరూప! ఓపరిశుద్ధుడ!
విద్యుత్ కాంతులతో నను జేరుము
మేఘోచ్చైస్స్వరాల భాషింపుము

—□—

౪౦

వర్షించుము కరుణఘటలు
నురుగులెత్త పొంగిపోవ
ఈహృదయ తటుల
వర్షించుము కరుణఘటలు
శుష్కించిన వీ మరుస్థలులు
పడలేదాక నీటిచినుకు

కాళరాత్రి బోలుఘటలు
పిలుపింపుము నామీదకు
అశనికశా ఘాతవ్యధ
నీమేదిని క్షోభపెట్టు
మెఱపింపుము, వెఱపింపుము
ఏమైనను ఈఉక్కను
పోనాడుము చెండాడుము
భీకర నైరాశ్యాగ్నుల
నాహృదికాల్చిన వేసంగిని
పోనాడుము హాతమార్చుము

నీ స్నిగ్ధ కరుణ జలధారఘటలు
నాపై నమసీకరించు

పితసు కుపిత దృగ్జ్వాలల
మండుచున్న బాలునిపై
ప్రియజనని సాశ్రులోచనాలు
వంచుపగిది సమనీకరించు
నీ స్నిగ్ధకరుణ జలధారాఘుటలు

—□—

## ౪౧

నీవు నిల్చినాడవు సఖ! నిబిడనిచుల
ఘన తరుచ్ఛాయల — కుదిచి స్కంధములను
దారి ప్రక్కల పోద్రోసి దగ్ధహృదయ
పాంథ జనులు నిను మలిన పాంసు వటుల
విడిచి సాగుచున్నారలు వినతదేహ
నైకరాన దాల్చి సురభిళాచ్ఛ కుసుమ
మంజరి నిలిచితి

కుటిల మార్గరతులు
వారు నాచేతి పూవుల పాత్రనుండి
పూలు రాలించి చెచ్చెర పోయినారు
శూన్యహస్తను నేనిప్డు శూన్యమైన
నభము నిలిచెను ననుజుట్టి నాల్గు దిశల

వేకువ లయించె మధ్యాహ్న వేళగడచె
సంజె కెంజాయ విరిసె నా సాశ్రునయన
కమల మఱ్రవాలి స్వప్న లోకమున మునిగె
నిజ గృహోన్ముఖులౌ ప్రతినిత్య పాంథు
లాగి యించుక యొక వింత అలతి నగవు
బఱపి నా మీాద కనుబొమ విరిచి విరిచి
సాగి పోయిరి

సిగ్గుతో సంకుచించి

వెల్లబోతిని బిచ్చపు పిల్లవోలె
ఆనన శ్రీని అవగుంఠనాన ముడిచి
ఎవరికోసము నిలుచుంటి వెందు కిచట
అని యడిగినార లెవరో నాయసువు గ్రుచ్చి
లాగినట్లయ్యె చురచురలాడిపోతి

నా ప్రణయమూర్తి కొఱకునై నా ప్రయాస
ఇచట గలియంగ హర్షాన నిచ్చెమాట
అనుట కామాట నోరాడదయ్యె నాకు
నా యకించన భైక్షుక నగ్నపాత్ర
నా మహా సర్వ సర్వంసహాధినాథు
నెదుట నిల్పుట ఓహో! నాకె విభూతి!
యూహ సేసిన మాత్రాన నూహకూడ
భారమై పోయె నతి గోప్య ఫలము దీని
నంతరాంతరా నునిచినా నణచి హృదిని

నే డుపసమించు గడ్డిపై నిలిచి నింగి
చూచుచున్నంత కాంచన చ్ఛురికయట్లు
మెఱసినాడవు కలల దొంతరలు గదలె
శతసహస్ర దీపము లొక్కసారి వెలిగె

నీవు మించుల రథముపై నీ శిరస్సు
వలయమున నొక ద్యుతి రేఖ వలిప వలిప
ముగ నొక పతాక, నీ రథ మూర్ధభాగ
మందు నడయాడె మెల్లగ నాగి నదియు

నీవు నేలపై కాలూని, నింగిలోకి
ఊర్ప్ప సెగల వెలార్చ్చ నన్నోము పోల్కి

ధూళి రేణులనుండి నా ధూసరాంగ
కముల స్వప్రాణముగ నతి కరుణతోడ
పరు కొనినావు గద్దెపై కూరుచుండ
బెట్టు కొనినావు

జీర్ణ వస్త్రను మలిన నిర్జీవ దేహ
మున నవిసియున్న దానను ముగ్ధతాభ
రాన భృశము కుములుచున్న దాన నట్టి
నన్ను — నీ ప్రాపు జేరిన నన్ను, జూచి
ముక్కుపై వ్రేలిడుకొని యా మూర్ఖపాంథు
లేగినారలు బాధగా నేమొ తలచి

కాని యదియు మిగిలె కలగాని కలగ
కాల మేఁగుకొలదియు నీ క్రమ రథపు
టులివు గూఢ మాటుమణఁగెను దధిహోలా
పొంగిపోయిన జయఘోష నింగి గలసె
ఆ వెనుక—నా యతీత సుఖానుభూతి
వెనుక, క్రీనీడలందు నీవె వెను దిరిగి
నిల్చినాడవు నాయాస, నేను దృక్కు-
లూర్ధ్వమున సాచి కన్నుల నొత్తుకొనుచు
శిథిల జీర్ణాంశుకముల చివికి నింగి
నేల జీరాడుచుంటి కల్లోల బాష్ప
ఝరులు హృద్వీథినుండి విచ్ఛాయవోఁగ

—□—

౪౨

నావలోన మన మిద్దరమూ
ఆ ఉదధిలోన తూలిసోలి
సాగిపోద మనినావు గదా !

ఏదీవికో ఈ జలయానము, ఏ రేవుకడల నాగునో
ఏరికినీ తెలియదనుచు ఏమేమో అనినావుగదా !

కూలహీన జలధిలోన
నీ శ్రవణోత్సుక శ్రుతిపుటాన
నే మధురగీతి నొకటి పాడ
కడలి సుడులు పసగుద్రోల
శబ్ద బంధనాల నొలిచి
కేవల స్వర వీచికయై
మది తేలియాడ
సాగిపోద మనినావు గదా !

ఆ స్వర్ణఘడియ ఏవేళకో, కర్మలేశమవశేషమో
నౌకా రజ్జువు లెపుడు విడునో, పశ్చిమాద్రి రశ్మివోలె

కెంజాయ లలరె కడలిపైన
జలవిహగధ్వని గూండ్లమునిగె
నిశి యెడంద చీల్చి మానావ
ఎపుడు నిర్గమించి పోవునో

నావలోన మన మిర్వురమూ
ఆ ఉదధిలోన తూలిసోలి
సాగిపోద మనినావు గదా !

---

## ౪౩

నీ కోసము నే నారోజున
స్వాగత సన్నాహగీతి పాడ లేదు
హఠా దాగమన వాంఛనుండలేదు
ఒక సామాన్యునివలె, సాధారణ వేషభూష
తో నడుగిడితివి
నా హృదయసీమ

నా జీవన నిర్వహణ క్షణ భంగుర
క్షణాలు, అమృత ముద్రాంకితాలు
అయినవి నీ స్పర్శ చేత
అవి వెలుగు రేఖలయి
విద్యుల్లత వలె మెఱసినవి
ఈ జీవన యవనికపై నా
హర్ష విషాద విస్మృత ద్యుతి పుటలతోడ
మిళితములై పొగమంచుల దొంతరలా
పొరలినవి

మలిన ధూళి క్రీడించెడు నను గని
ఈసడించుకొనలేదు నీవు

నా కనగత మాయె నిపుడు
ఆ క్రీడా సమయాన విన్న
నీ గున గునలే, నీ పద ధ్వానులే
విశ్వ రజఃపథ కణకణ మందున

ఆకాశపు తారల ప్రత్యణువు
లోన వినిపించెడు



## ౪౪

ఎండవెనుక వానజల్లు
వెలుగువెంటె నీడ యిటులు
తరలుచున్న త్రోవలోన
హర్ష మొదవ వేచ్చి కన్ను
పాచుచుండె ఎదురుతెన్ను

అజ్ఞాత లోకదూత లెవరొ
అభినందించినారు వచ్చి
చెచ్చెర ఎటకో లి త్వరలోన
కనుమరుగై పోయినారు

సురభిళించు గాలిలోన, ను
య్యాల లూగ నా యెడంద
ప్రొద్దుపొడిచి జామువఱకు
కూర్చుంటిని ద్వారముకడ

నా కనిపించు నపుడప్పుడు
ఏతెంచునులే ఆవేళకూడ
ఉండి ఉండి మూగితలపు
ఒక్కుమ్మడి త్రుళ్ళిపడగ
కాంచుదులే నిను, నీరూపుగూడ

అంతదనుక పాడుకొందు
ఒంటరిగా నవ్వుకొందు
అంతదనుక గాలికూడ
ధ్వనిసంకేతము లిచ్చుచుండు

ఎండ వెనుక వానజల్లు
వెలుగునంటి నీలియిరులు
తరలుచున్న దోవలోన
హర్ష మొదవు విచ్చికన్న
చూచుచుండ ఎదురు తెన్ను



౪౫

విశ్వానా పదమంజీరక్వాణులు
ప్రియము చేగుదెంచు ప్రియము చేగుదెంచు
ప్రతిక్షణము, ప్రతిగ్రీష్మము
ప్రతి శిశిరా, ప్రతి హేమంతము
ప్రియము చేగుదెంచు అడుగులసవ్వడి

ఏమో తేటల, ఏమో రూపుల
ఏమో స్వరాల హృది ఆలపించునో
అన్నుల నడయే వినికిడి
ప్రియము చేగుదెంచు, ప్రియము చేగుదెంచు

మధుమాసపు పసులపాపలు
నవకిసలయ రాగారుణ సంధ్యలు
గుసగుస అవి సన్నని అడుగులు
శ్రావణ ఘనరథ నిర్గమ ధ్వనుల
క్రొక్కారు మెఱుపు వారుణ రథ్యల
ప్రియము చేగుదెంచు అడుగుల సవ్వడి

సుఖ దుఃఖము లీహృది నలుమూలల
కుడి యెడమల నిండిన అడుగులు
తచ్చరణ ఝురీ నిమ్నోన్నత
కూలధ్వనులు — విన్నావా!
పద మంజీర క్వణులు
ప్రియు డేగుదెంచు ప్రియు డేగుదెంచు

—□—

౪౬

ఎప్పటినుండీ సన్నాహము
నాకై నీ యభిసారము

ఈ హిమకేశు లీడిన దేవులు
కేలబన్ని పయనించియు
నీకుగాక, నీకనుగోనకు వెలిగా
నను జేయ జాలినార ప్రియా !

అతిమహానముగా నీయడుగుల
చప్పుడువింటిని యిఱుసంజెల
నీ మూతిక నాహృది చేరబడి
నాకిడె నొక గుప్త నిమంత్రణ
అతిలోకపు టానందము వెల్లువగా
పొంగులారె నాజీవన మేలనేడు

మదిలో చెలరేగిన తుమ్మెదరొద
నీ మిళనవేళ ప్రాపించెన !
కార్యకరణ విచ్యుతియా నాకిక
పుష్పాదులై నీరాకలు
గుబాళించె నా గాలుల

ఎప్పటినుండీ సన్నాహము
నాకై నీయభిసారము

—□—

౪౭

రేయి చనంగనుండె తొలిరేకల కన్నులలోన వ్యర్థమై
పోయె సుధాంశుకోచి విడిపోవని ఱెప్పల లుబ్ధనిద్ర న
న్నా యెల బూచు వేళ ప్రియుఁ డొయ్యన వచ్చెడి నేమొ నెచ్చెలీ!
వేయకు ద్వాః కవాటము ప్రవేశము నడ్డకొనంగ బోకుమా!

ఆ పదనిస్వనమ్ము లల్లత్రై కనుఱెప్పల విప్పకున్న నీ
వే పని గట్టికొన్న యటు వెంగలినై నను మేలుకొల్పబో
కీ పసవంపు తెమ్మెరల కే ఖగకాకలి కీ ప్రభాత కాం
త్యాపగ కీ వెలుంగు రమకై నను మోహము లేదు మద్
హృదిన్.

అహహా! నిద్దుర, నాకు నా నిదుర యత్యంతప్రియంబై ముదా
వహమై పొల్చుచునుండు నా సఖుని తీవ్రస్పర్శలోనే సఖీ!
కుహనా స్వప్నముటుల్ ప్రియుండు నిదురన్ కుంచించి
నిల్వన్ కడన్
విహసించున్ కనుఱెప్పలా సుభగ నవ్యేందుస్మితి చ్ఛాయలన్.

తొలివెలుగుంబలెం దొలుత దోచిన రూపము పోల్కి నాదు క
న్నులమొన వానిపోయగము తుంపెసలాడగ నిమ్ము భవ్యరో
చులగొని నా చిదాత్మ వికసనల చొక్కగ నిమ్ము నేను నన్
గలియుట ఆ చిరంతనునికై పసవెత్తుటయే గదే సఖీ!

—□—

౪౮

సుసంచిర కాకలీస్వనములు కేహన్న రహస్సున క్రోయదుగ్ధ సా
గరగత వీచికలై సుఖవికాసము బొందిన దా ప్రభాత వే
ళ, దరిత హేమధూళుల మొలరాము పథోధర నీలమాలికా
వరణ పటాంచలాల చెలువారు నభస్సు వినాత్మ సత్వమై

మాకు నగుపడె నే ముకు మాపథాల
సాగుచుంటిమి వ్యస్త విశ్వస్త గతుల

అనుపమ హాస్యసంభ్రమము లాత్మసుఖంబుల నీయలేదు, మే
మును తమకానలోక చెడవోమయి పోతిమి గీతవాద్యముల్
వినిచినగాని పీని లరవించక పోయెను మేము చేరి నే
మని పలికింతు మంగడుల మన్నిక వెచ్చముకైన బోకమే.

పోయినాము మా ప్రోవల ప్రొద్దు గడచి
పోయినను నిలువక పారవోక నగక.

ఇనుడు శిరస్సుపై నిలిచె నీదురుగాలులు వెచ్చవెచ్చనై
కనలె విహంగముల్ బడలి ఘర్మము నోర్వక వెల్గునీడలం
దునబడెపాండుపత్రములు దూగుచునుండెను గొల్లడొక్క ప్రా
సిన లతనీడ నిద్రక మునింగె నిదాఘ భరమ్ము నోర్వ లే

కేను నొక హ్రదమున కేగి మ్లానదేహ
మా తటమున జేర్చితి కాళుల వల పఱచి

నా సహయాత్రికుల్ విడిచినారలు న న్నొకసక్కెమూడి, యా
త్రాసహనమ్ము లేమికి చిరాకు వహించిరి దృష్ట శీర్ష మా
శా సువిశాల భిక్షులకు నాచి హుటాహుటిని నొక్కరొక్కరా
యాస భరాన దొ్రటిలుచు నట్టిటు కొండల నెక్కివంగుచున్.

కలసి పోయిరి నీలిమబ్బుల నభాన
పొందసంత యాత్రికులార ! పొల్చుయశము

నలుగురు నవ్విపోదురని నాకనుతాపము లేదు శ్రోన నే
యలుకయు లేదు నిందలకు నాత్మ తిరస్కృతి కైననేను నా
దల నమియించ లేదు పరితాపవిహీన పరాభవాంక చ్ఛో
లల సుఖనిద్రలన్ మునిగి గమ్య సుషుప్తుల దేలిపోయితిన్.

అరుణ కిరణాల యల్లిక నందగించు
శాద్వల చ్ఛాయ లతల విశ్రాంతి నిచ్చె

యాత్రాలక్ష్యము విస్మరించి కలగీతాంభోధిలో, నీడలో
గాత్రస్ఫూర్తి లయించినాడ తిమిరాకారస్థితిన్, నీవు నా
నేత్రానన్ నిలుచుంటివంత నహహా! నీదివ్యహాసప్రభా
మాత్రానన్ సుఖనిద్ర యుత్ప్లవితమై మాయాప్రభావంబునై

తునిగపోయె విచిత్ర మా తములదీర్ఘ
మార్గ మెచట ! ఎచట నీ సమాగమంబు !

—□—

౪౯

నా కుటీర ద్వారము కడ
నిల్చినావు పీఠిక దిగి

ఈ గదిలో మాటుమూల
నొదిగి పాడుకొంటి, నా
స్వరమాలా లహరిక
నిన్నా యెల యూగించెనా

నా కుటీరద్వారము కడ
నిల్చినావు పీఠికదిగి

నీ సభలో గాయకులో హో!
వేనవేలు తలయూగిస్తారు
మాయి వోగిపోవ పాడుచుంద్రు
నా శైశవ సంగీత మేల
ఊగించెను నీ హృదయడోల

నా లఘుగీతిక సంలీన మాయె
బృహద్విశ్వ గీతమాల
కేలబూని ఒక పూల కాన్క
నా కుటీర ద్వారముకడ
నిల్చినావు పీఠిక దిగి

—□—

## ౫౦

గృహము గృహమున బిచ్చపుగిన్నె బూని
తిరుగుచుంటిని వీధుల కఱకు చెంత
అంత దవ్వుల గన్పడె నతుల శోభ
లీను స్వర్ణరథ మొకటి, యిపుడు కలల
రాశినై వచ్చు మౌలిక రాజలాంఛ
నాల నది నింపె నా నయనాల వింత
రథము మీద నా రాజాధిరా జెవండొ

వెల్లువేగిన యాసలు పేర్చి తలచి
నాను, మనసున నా దుర్దినములు గడిచె
పొంచియుంటిని దానాల పొంగడి యడుగ
కూరక లభించు గింజకై దారి కెలన
దొరలు నుండిన ధనముకై దోయిలించి

మెల్లమెల్లగ రథమాగె మెఱపువంటి
నగవు నామీద వ్రాలెను నాకు నొడము
భావిభాగ్యము దలచి విస్ఫారితాంత
రంగుడ నయితి నంత సురమ్య పాణి
చాచి నామీద నాకే ప్రశస్తధనము
నిత్తువో తెల్పుమనినావు నిల్చినాడ

స్పష్టముగ నొక్క సడియు నిస్తంద్ర వైభ
వాహినీనాథునకు నను నవాశ సప్పుడు
దూష్న చేయుట కనుపించె మాటకమ్ము

చకిత చకితాన సంజకై క్షణము చూచి
జోలి యడుగున నంగుళి జొన్పి చిన్ని
యన్న కణమును వెలికీసి యర్థన! నీకు
నర్పణము జేసితి రథము న స్తమించె
సంజె కెంజాయ నొకచాయ చమరిపోలి
నొలక బోసితి నచ్చెరు వొక్క స్వర్ణ
కణము బిచ్చాపు నూకల గలసియుండె
సర్వమును నా ప్రభువు పమిటేమున నేల
కుప్పపోయగ నెదని కుందినాను

—□—

౫౧

విప్పారిన రాత్రి యిరులు
పనులన్నియు ముగిసె మాకు
రావలయువారు వచ్చినారు
పురద్వారము వేయబడియె
ప్రభువే రాలేదన కొంద
అన్న మేమించుక నగినారము
"అసంభవ మది వార్త ఊహ"

ద్వారబంధ మొకటి చప్పు
డయ్యె మేమనుకొంటి మంత
గాలితాకు గాబోలది
దివ్వెనార్పి పరుండినాము
"దూతవచ్చి నిల్చినాడు"
అనిరి కొంద ఱదేటిమాట
పవనవీచి దప్ప వేఱే
మియు లేదని నవ్వినాము

అర్ధరాత్రి ఊర ప్రొద్దు
పోవ మరల శబ్దమాయె
నిదురకనుల మగత మేము

"సుకూర తీరజలచరాల
ఘోషతప్ప ఏమి లేదు"
అని టలాయించినాము

పృథ్వి కెరలె భిత్తి కదలె
నిదురసుఖము కళవళించ
అది రథాగమ మంద్రఘోష
అనినారు వారు మరల
జలచరాలు కదలుఘోష
దప్ప వేఱు లేదటంచు
కునికి కలవరించినాము మేము

అంధకార మః శేషము
నిస్వనించె విజయభేరి
ఇక తడయక రండు లేచి
అనుచు ధ్వనులు ముమ్మరించె
కంపించె తనువు గుండియ
ఒదిమికొంటి మంత నౌకరు
రథపతాక కాదా యని
మూదలించినారు మమ్ము

ఒక్కుమ్మడి లేచినాము
ఇక జాగుసేత మేలుగాదు
అని పిల్లుగ అఱచినాము
ప్రభువు వచ్చె, ప్రభువువచ్చె
దివ్వెక్కడ ? మాలలేవి ?
ఆసనమూ, అలంకృతులు
లేవు లేవు సిగ్గు సిగ్గు
కలగి శిరసు లొగ్గినాము

మా గొంతుక లణచి యొకడు
పలికినాడు సోత్కంఠగ
గగ్గోలు పడుమ రేల రిక్త
పాణినెత్తి ప్రణమిల్లుడు
శూన్య గృహము అయిన నేమి
ప్రభువు కింత చోటీయుడు
ద్వార కవాటపాళి తెఱచి
సేయుడు శంఖారావము

ఈ తమోరాత్రి వచ్చె
తన శూన్య కుటికి రాజరాజు.

తిమిర గృహము కడకు వచ్చె
వేగ నిరాశ ప్రణమిల్లుచు
గుభిల్లుమన్న దంష్ట్రాకార
వక్షము రల జేసె మొఱపు
ప్రాంగణాన పఱచిరందు
చిరి గున్నను చాపనొకటి
త్రాస ప్రదగ్రాత్రి జేడు
వచ్చెనేడు తుపానులెత్తి

— ◻ —

## ౫౨

ఆస జెందితి భవదీయ భాసురగళ
సీమ వ్రేలు గులాబీల దామమడిగి
కైకొనగ, కాని మాటాడ లేకపోతి
రాత్రియంతయు కనుఱెప్ప వ్రాల్చలేదు
ప్రొద్దు పొడువగనే పాన్పు పొంతకేగి
పడిన పూవు లేసుకొను సదాయవశత
కూరుచుంటిని తెలవారె కోర్కెలూరు
కనులతో శయ్యకడకేగి కాంచ నచట

లేదు విరిదండ విరులును లేవు లేవు
ఒకటి రెండు పూరేకులె యుక్కలియున్న
విదియె ప్రేమోపహారమా! ఇది సుమముల
మాలయా! సుమము! సుగంధమా యదేమి!
ఏమియును గాదు నీదు ప్రభామయూఖ
మిది తళత్తళల కరాసి ఉదయవేళ
ప్రసృతమైన కిరణము, గవాక్షపాళి
నుండి దిగి శయ్యపై వ్రాలెను, ఖగచయము
సన్నడిగె భామ! ప్రేమ చిహ్నము లభించె
నా లభించనే లేదు తునాతునియలు
అయ్యొ నాకోర్కె; ప్రేమోప హార మిదియు!

నీ వరాల కంకణము నిర్నిద్ర ధవళ
తారకా గుంఫితమ్ము విస్తార రత్న
ఖచిత ఖచితము సుభగము కాని గరుడ
పక్షి వాలు ఱెక్కలవలె వంగియున్న
నీ కరాసి యత్యాకర్షణీయము నభ
పటమును జీల్చు విద్యుదాభాసయట్లు
క్రుంకుమెట్టిన భానుని రుధిర రక్త
కీలలందీసి కరగిన ఫాలభాతి
వోలె నీహేతి సుప్రభా శోభితంబు

మృతిపదన్యస్త విహ్వలాహత నిపీత
జీవనమ్మున కంపిలు చివరిమూల్గు
వోలె నీహేతి కంపిలు నొక్కదీప్త
కణసహాయాన పార్థివగ్లాని గూల్చి
భస్మమొనరించు, నాత్మ ప్రభామయూఖ
మట్లు మెఱసెడి నీహేతి యతిసుభగము

నీవరాల కంకణము నిర్నిద్ర ధవళ
తారకా గుంఫితమ్ము విస్తారరత్న
ఖచిత ఖచితము సుభగముకాని, కాని
నీ కరాసి నిపుణకళా నిర్మితమ్ము
అరసి కననైన భయమగు వరుణరాజ!

—□—

౫౪

నా పేరేమో తెలుపక
సడీ చప్పుడు చేయక మెల్లగ
నిలుచుంటిని నీపదాలు
నిర్గమించు వేళ వాలు
నీడపట్ట భావికాడ
నే నొంటరిగా

పల్లె పడుచు లెలుగులెత్తి
ఎవరోహో ! మాతో రమ్మిక
ప్రొద్దు గ్రుంకు వేళాయెను అని
పయ్యెదపై చినుకులు బడ
తొణికించుచు జలఘటాలు
పిలిచి పిలిచి పోయినారు
వలవంతలనే తలవంచితి

వినలేదప్పుడు  నీ యడుగులు
నీ మోమున నైరాశ్యపు నీడలు
డగ్గుత్తిక బడ పాడినాలుక
పలికినావు పథయాత్రీ !
తృష్ణాకుల యాత్రిని అని

కలగిన హృది చౌకళించ
పగటి కలలు తునిగిపోవ
నా జల కుంభము వంచి నీ
కరాంజలి ఒలికించితి పానీయము
చిటపట పండాకుల రొద
చూజాయగ కను చీకటిలో
కూసిన కాకలితో వినిపించెను
దేవదారు పూల జల్లు
లో తేమలని మొలకగాలి
ఝల్లున వీచెను

నా పేరడిగిన మిన్నక
శిరమిడి నేలకు జూచితి
ఓ చిరయాత్రీ! నను మఱువవు
నే నొనరించినదే మేలునీకు?
జలమిడి నానారోజున
సేదదీర్చి నా నొక పాంథునికని
స్మృతినేదో కడు తీయగ
గిలిగింతలు వెట్టెడు నను

అలసిన గొంతుకతో పిట్టలు,
కలరవ మణగారె, చల్లని సరస్సులు,
తలపంకించుచు నే నిలిచితి
ఏను వేప క్రింద బరువుగ

—౩—

# ౫౫

నీ హృదినేదో బరువుగ
కనుగవ నిద్దుర మత్తుగ
వినలేదా ముల్లుల మొనపై
చిఱుపూవులు రాజ్యముచేయుట
వేళవ్యర్థపుచ్చ బోకు
మేలుకొమ్మ, మేలుకొమ్మ

గులకఱాళ్ళ బాటచివర
ఒక వొంటరి దేశమంట
నా మిత్రుని యధివాసము
ప్రతారించ బోకు వాని
మేలుకొమ్మ, మేలుకొమ్మ

నడిమెండన నిసరశ్మల
మిన్ను క్రాగి పోవనేల!
వేడివేడి యిసుక పొరలు
పిపాస - వలువ గప్పనేల

ఆనందము కాదా నీ అంతర్హృది
నీ ప్రతియడుగున పథ విపంచి
వేదనా మధుమయ తంత్రుల
మీటి మ్రోయదా ఝుమ్మని

—□—

ప్రీతి కడిగి. వచ్చినావు
నీకింత లేసి ప్రేముడి
నేనువినా నీ ప్రేమకు
తావెట లోకేశ్వరా !

నీ యనంత వైభవ రాశికి
నను భాగస్థుని జేసినావు
అఖండలీలలు జూపెడు
నా హృదిలో నీ ఆనందము

నా జీవన యవనికపై
నానారేఖలు గీయును
నీకోర్కెల కుంచియు
నాహృది కర్షించుట కేనా
నిను నీ వలంకరించుకొంట
అందపు బరికెగ

సమావిష్టమైన దాకతాన
నా స్నేహము నీ స్నేహానలాన
ఇట ఈకలయికలోనే
దర్శించితి•నిను విశ్వదేవ !
ఫీతికడిగి వచ్చినావు
నీకింత లేసి ప్రేముడి

—▭—

కాంతీ! నా అనుంగుకాంతీ!
విశ్వ విస్మృమర చిరకాంతీ!
నయనాలింగన శాలిని కాంతీ!
హృదయాంతర మధువర్షిణి కాంతీ!

హే ప్రియ! నా జీవన కేంద్ర బిందుపై
నర్తించు చున్న నీ సుఖద కాంతి
నా ప్రణయ విపంచిని
ఝుమ్మనిపించుచున్నది కాంతి
మేల్కొన్నది తత్కాంతికి నింగి
తత్కాంత్యేరిత ఉపవనవీచి
తత్కాంతికి నవ్వెను పృథు మేదిని
కాంతి అలలలో మిణుఁగురు వీడెను
కాంతిజ్వాలల కుసుమించెను
కుంద కమల మల్లీ వల్లులు
మొయిలులపై బడి కాంత్యంకురాలు
మెఱయును బంగరు పుష్పాళులై

శత సహస్ర మణి ద్యుమణుల
వెద జల్లెను కాంతి నభము
ఆకునాకు నందనంత సుఖద్యుతి
స్వర్గాపగ ముంచెను కూలద్వయి
ఒరసెను ఆనందపు టురవడి

—□—

## ౫౯

ఆ ఆశల నర్తించెడు కాంతులు
ఆకసాన తిరుగాడెడు మబ్బులు
నా మూర్ధము చల్ల బరచి
వేకువ కౌగావిచెడి గాలులు
నీ ప్రేమదప్ప వేఱుగాదు
నే నెఱుగుదు ప్రాణసఖా !

ఉషోరశ్మి తొలివేకువ
పొంగించెను నాచూపును
నా హృదికై ఇది నీ సందేశము
నాకభి ముఖమై నీ ముఖ మమరెను
నీ కన్నులు నా కన్నుల చిక్కెను
నా హృది నీ యడుగుల చుంబించెను

—□—

# ౭౦

అనంత ప్రపంచాల
అగాధ సాగర తీరాల
ఆడుకోను వచ్చినారు
అబ్బాయి లెంద రెందరో
సీటి కుళాయిలా పైననింగి
ఉరకలెత్తుతూ కడలి క్రింద
రేవుమీద ఆటపాట
లాడుతూ పిల్లగాండ్రు
అనంత ప్రపంచాల
అగాధ సాగర తీరాల
అబ్బాయి లెంద రెందరో

వట్టి యిసుక కుప్పలిండ్లు
చేసినారు గవ్వల్తో
ఆడినారు చాలసేపు
ఎండుటాకు నావలల్లి
వదలినారు సాగరాన
అనంత ప్రపంచాల
అగాధ సాగరతీరాల
అబ్బాయి లిలా ఆడినారు

ఈతరాదు లోతు నీటిలో
జాలమేసి లాగలేరు
పెద్ద పెద్ద యీతగాళ్ళు, ము
త్యాలు కోరి మునుగుతారు
గొప్ప గొప్ప బేరగాళ్ళు, వ్యా
పార నావలెక్కి సాగుతారు

వత్తగుల్ల లేరి పిల్ల
గులకరాళ్ళ గవ్వలతో
ఏమేమో ఆడుతారు
దాగియున్న రత్నాలకొండ
ప్రచ్ఛిత్తీయ తెలియదాయె
ఈతరాదు లోతు నీటిలో
జాలమేసి లాగలేరు

పరిహసించి కడలి త్రుళ్ళి
పడిమెసంత పసుపు కాంతి
అలమికొనియె నీటిమీద
మృతిఫేనాయిత తరంగాల
మోత తల్లి జోలపాట

నోరు లేని పిల్లగాం డ్రు.
కదలికూడ ఆటబొమ్మ.

పసుపురంగు కాంతి వెల్లి
విరుస్తుంది మరల మరల
తరంగాలు పిల్చి పిల్చి, క్రొ
త్తాట లెన్నొ నేర్పుతాయి
అనంత ప్రపంచాల
అగాధ సాగర తీరాల
పిల్లలాడుకోను మూగినారు

తుపాను రేగి సుడులు తిరుగ
దవ్వు లేగి పెద్దనావ, తు
త్తునియలయ్యె సాగరాన
రెక్క విప్పి మృత్యుపక్షి
తిరుగుతుంది జలధిమీద
పిల్లలాట చెరగ లేదు

అనంత ప్రపంచాల
అగాధ సాగర తీరాల
తిరునాలవోలె మూగినారు
రకరకాల పిల్లలు

—□—

౭౧

పసిపాపకు కన్నుమీద
ఎలావచ్చి చేరు నిద్దుర
తెలుసా మీ కెవరికైన!

అడవిలోన కొండకోన
ఉన్నదచట అచ్చరకన్నెల
అందమైన వో దేశం
మిణుగురు పుర్వుల రెక్కల
మబ్బులోన కదులును కాంతులు
మొగ్గలు రెండున్నవి అట
మోహనాతి మోహనముగ
అచ్చట నుండీ నిద్దుర
పసి రెప్పల దాకను
వస్తుంది.

పసిపాపకు నిద్దురలో
పెదవిమీదకు ఎలావచ్చె
చిన్న నగవు?

విదియనాటి చందమామ
తొలికిరణాలు చలివెచ్చగ
ఒకసెనంట శారదమేఘపు
టుంచున శిశిరోషస్సున.
తొలిసారిగ నది స్వప్నంలో
తరగలించి పెదవిమీద
చిలికించెను చిన్నినగవు
ఈ కోమల లావణ్యం
ఎలా వచ్చె శిశువుమేన?

నవమాసావనగా శిశువు జనని
తొణుకాడిన దొకరోజున
అప్పటి హృదయం తొలిప్రేమన
ముద్దకట్టి తేనె కురిసె
ఆ ప్రేమవాక దాగిదాగి
శిశువుమేన వెల్లివిరిసె.



## ౮౨

ఓ నయ గారవుంబుడుత ! ఓ పసిపాపడ ! నీకునాటకై
నేనపు డందపుంబొమ లనేకము దెచ్చితి జూడు మప్పుడే
నేను గ్రహించితిన్ మొయిలు నీడలలో పలురంగు లేలకో
వానల సోనలం బారలు వాకలలో మెఱువంపు లేలకో
నేను గ్రహించితిన్ బొమలు
నీకయి తెచ్చిననాడె కుఱ్ఱడా !

చల్లని పాటపాడి మనసార నినుంగదలించి శింజినుల్
ఘల్లుమనంగ జేతు సరిగా నపుడే గ్రహియించితిన్ విరుల్
పల్లవముల్ కలధ్వనులు పల్కుట, సంద్రములోని వీచులల్
బిల్లగ రేగి యాపుడమిపిల్లకు వీచుట తన్పుంచుండుటల్
చల్లని పాట నీకు మన
సారగ పాడిననాడె కాంచితిన్ !

చిన్ని జిలేబిచుట్ట నఱచేతుల బెట్టిన నీవు నాపయై
కొన్నవిధాన జుట్టితివి కుఱ్ఱడ ! తెల్లము చాలు చాలు లే
యన్న ! అదేగదా! పువులయందపు గిన్నెల తేనెకాన్క యా
పన్నిదమే కడుంబసిమి పండుల తీపి రసాయనంబయెన్
చిన్ని జిలేబిచుట్ట నఱ
చేతుల బెట్టిననాడు కాంచితిన్

చెక్కిలిమీద ముద్దునిడి చిర్నగవ్వున్ జిలికించినీకు, పే
రక్కజమొందమున్ క్షణమహో! సుఖమయ్యాదియేయుషస్సునం
జక్కగపాజీ వెల్గుల రచించెడి నా విభవంబు గాదె కై
చెక్కిన చైత్రమాస వనవీథుల తెమ్మరవై స్పృశించెడిన్
చెక్కిలిమీద ముద్దునిడ
జేర్చిననా డిది యేనెరింగితిన్

—□—

నే నెఱుగని నా మిత్రుల
కెఱుక పరచినావు నన్ను
నావిగాని పెఱిగీముల
నన్ను ప్రవేశింప జేసినావు
దూరము దగ్గరగా ఒరుఁడే
నా వాఁడుగ అయినాఁడు నీకతాన

నే మసలిన యింటికి
నే దూరము అవుతున్న వేళ
నాకెంతో హృదయబాధ
నవ్యతలో ప్రాచీనము
దాగియుంట, అందు నీ
వలరియుంట, నే
మఱచితి—నిజమును

ఈ లోకములోనో
ఈ లోకము ఆవలనో
జన్మమరణ నౌకలపై
ననుచేర్తువు చిరబంధూ !

ఆనందపు బంధనాల
ముడి వెట్టుమవా
తెలివారిని నాహృదితో
నాజీవిన సహవాసీ ?

నిన్నెఱిగినవారికి, ఈ
జగమున తెలివారెవరు ?
స్వాగత మతనికి వీధివీధి
భిన్నత్వపు బహుక్రీడలలో
ఏకత్వపు స్పర్శసుఖము
నాకుండు నటుల జేయుము
ఇవియె నా యభ్యర్థన

—□—

నిర్జన తటినీ తటమున నిలిచి పచ్చి
కల నడుమ నేనడిగినాను "కమలనేత్రి !
ఎటకు పోదువు పయ్యెదనిట్లు చాటు
జేసి దివ్వెకు నా యిల్లు చీకటి నిల
య మతి శూన్యమునై యుండె నందు వెలుగ
జేతు నాకిమ్ము"
అననామె చీకటి కను
లెత్తిపలికె "నీ దివ్వెను విడతు పశ్చిమాన
నినుడు గ్రుంకెడు వేళల నీ నదీమ
తల్లి ప్రఖరధారల"
విస్తృత తృణశాటి
నిల్చి యొక్కెడ జూచితి నేను తెప్ప
వేయక మకమకమని యా పిన్నదివ్వె
కొట్టుకొనిపోయె వ్యర్థదిక్కూలములకు.

గుబురు చీకటులొరయ వాక్కును పెకల్చి
ఎట్టకేలకు నంటి "మత్తేభయాన!
నీదుగృహమున వెల్గెను నిఖిలదీప్తు
లెటకుబోదువు పయ్యెదనిట్టు చాటు

జేసిది వ్వెకు నా యిల్లు చీకటి నిల
యమతి శూన్యమ్మై యుండె నందు వెలుగ
జేతు నాకిమ్ము”
అననామె చీకటి కను
లెత్తి శంకతో మరల పైకెత్తిమోము
అనెను “గగనాన నీదీప మర్పణమ్ము జేతు”
నే జూచినాను నిర్జీవదీప
మరుగుచుండెను వినువీధి వ్యర్థముగను

అర్ధరాత్రాన నమవస, అంధకార
నిబిడమైయుండ నడిగితి “నీలనేత్రి!
ఎడదలో నిడికొని దివ్వె నెవరివెదుకు
చింత బోదువు నాయిల్లు చీకటి నిల
యమతి శూన్యమునై యుండె నందు వెలుగ
జేతు నాకిమ్ము”
అన నామె చీకటి కను
లెత్తి క్షణమాగి ననుజూచి యెలుగుపడగ
పలికె “నీదివ్వెనితర దీపాలగలుపబోవు చుంటిని”
అటవాని పొంత వెల్గు
దివ్వె వెల్లబారుట చూచితి వికలముగ

—□—

౮౫

ప్రజ్వలించున్న నా జీవన పాత్రనుండి
ఏ రసాస్వాదనము సేయ నెంచినావు
ఓ కవీ! నా కనీనికనుండి నీవు
చూచుకొందువు నీదు కాణాచిసృష్టి
వినుచు నుంటివి దేవ! నావీనునుండి
స్వీయశాశ్వత సుందర గేయఫణితి

అల్లుకొంటిని నేను నీ యతులసృష్టి
నుండి వాగ్విలాసమచట తునిగి తునిగి
నీదు నానందమె స్రవించి నింపె గేయ
సుఖము, ప్రేమభారమ్మున చొక్కి నీకు
నీవ నాకప్పనమగుట నీకు గల్గె
నటులె నాలోన మధుర రసానుభూతి

—□—

## ౮౮

సంధ్యారక్తిమలో వెలిగి నా అంత
రాంతరాల, నివసించును అది
ప్రభాత రోచిస్సుల నెప్పుడు
తన మేలి ముసుగు విడనాడదు
దాని నుపాయన మిత్తునీకు
నాచరమగీతి సహాకారంతో

నే చెప్పిన వినదది వినుపించుకోదు
మొండిది, నాయెదలో దాచిదాన్ని
దేశ దేశాంతరాలు విహరించితి
నాజీవన ప్రహోసక్షయ
కేంద్ర బిందువై అలరారిన దది.

నా ఆలోచన, కర్మ, నిద్రాస్వప్నాలు
పాలించినదది ఒంటరినై
నిలిచినది. వేల ప్రజలు నా తలుపుదట్టి ,
పృచ్ఛ చేసిచేసి వేసారినారు
లేరీ విశ్వమందు ఎచ్చటనూ
దానిని దర్శించినవారు
నీ పరిచితికై అది వొంటరిగా
రేబవళ్ళు ప్రతీక్ష సేయు.



## ౬౭

నీవు నీలాంబరమ వీవు నీడమీవు
నిఖిల సౌందర్యమూర్తివి, నీ కులాయ
మందు నీ ప్రేమ వలన నీ యాత్మ వివిధ
వర్ణ శబ్ద గంధముల చిక్కువడియె, నిచట
దక్షిణకరాన దాల్చి సౌందర్యకుసుమ
హారభరిత సౌవర్ణ భృంగార మదిగో
వచ్చుచున్నది స్మితసుప్రభాత మదిగో!
అవని శిరమున నైగసేయ
అదియె - అట

ప్రశాంతి - పశ్చిమజలరాశి శాంతిజలము
నింపుక విపథముల పయనించి వచ్చు
చున్నయది సంధ్య, నిర్జనశూన్య నీర
వోపరములకు కాని
ఆ యూర్ధ్వ నభము

ఆత్మ సుఖవిహారమున కనంత వక్ష
ముచ్ఛ్వసించి పఱచుకొని యున్నదచట—
అచట నిర్మల ధవళ శీతాంశుకిరణ
ధారలేపొంగు నిత్య ముదాత్తకాంతి
కాలవాలమది, అచట చేలుపవల
రాకలే లేవు రూపవర్ణముల రుచులు ,
లేవు, లేవట వాఙ్మయలీల కూడ



## ౬౮

నీ రవికిరణం పురివిప్పుక
నిలుచున్నది నా ద్వారముకడ
మెల్ల మెల్లగ భువిమీదకుదిగి
నా ఊర్పులతో సాశ్రునయన
రేఖలతో గీతులతో
అల్లిన నా జలధరాలు
నీ చరణాంగుళికడ జేర్చునేమో
నీ రవికిరణం పురివిప్పుక
నిలుచున్నది నా ద్వారము కడ

చుక్కలు నిండారిన నీరొమ్మున
నిడుకొంటివి నిష్కలంక ! సప్రీతిగ
పెనుమబ్బుల నల్లని దువ్వలువను
పలుముడుతలు నానారూపులు
క్షణక్షణము మారుచున్న
రంగునీళ్ళ మెఱిపించుచు

ఈ జలధరాలు, ప్రతను సూక్ష్మ
చంచలాలు, స్నేహదుగ్ధ మంధరాలు
నీహృది కాణాచులు
నీ ధవళోజ్వల చిరకాంతిని
కతాన కప్పెడు తన
అరుణామయ ఛాయాంచలాన
నీ కరవికిరణం పురివిప్పక
నిలుచున్నది నా ద్వారముకడ

—□—

## ౬౯

నా జీవన దుర్దమ ధారలు
నరనరాన రేబవళ్ళు ప్రాకెను
అవియే యీ విశ్వాణుల
నుప్పొంగెను ద్రుతగతి ఘనులై
తాలస్వర సంగీత ధ్వనులై

ఆ జీవనమే ఉద్భిత్తృణ
రోమములై ధూళుల పులకించెను
తరు తరువున పూజొంపపుటలలై
విప్పారెను హసియించెను

ఆ జీవనమే జీవన మృత్యూగ్ర
భయద వార్ధ్యంతరాన
జలగర్తములై జృంభించెను
నా అంగ ప్రత్యంగము లా
జీవన బాహ్వాలింగన స్పృష్టములై
నా కునికి నిచ్చె గౌరవ మిచ్చెను.

నే నా జీవన స్పందన
మద గర్వోష్మిని, నా అసృజ్నాడుల
నర్తించు చున్న దిప్పుడు
ఈ నిముసాన గూడ

—□—

## ౭౦

ఈ ఆనందోద్దామ ధావనలో
ఈ ప్రచండోగ్ర సంగీత ధ్వానంలో
హర్షించుట, సుడులు తిరిగి
నుసియై పోవుట నీ కశక్యమా!
వడిదుడుకుగ, అవిగో! ఆ వస్తులు
త్రోసుక పోతున్నవి మున్ముందుకు
ఆగవు వెన్కదిరిగి చూడవు
చేయూడదు ఏ శక్తి వాని నాప
త్రోసుక పోతున్నవి మున్ముందుకు
ఆ ప్రచండోగ్ర ధ్వన్యాఘాతములై
అరుదెంచును ఆఱు ఋతులు
మరల మరల నర్తించుచు పోవును
వాసన, పుప్పొడి, రంగులు, ఈలలు
సెలయేళ్ళై, జలపాతములై
గలగల మని పడుచున్నవి
ఆ ఆనందోత్కట వాహినిలో
ఉత్ప్లవించి వ్రీలి తూలి
క్షణక్షణము మ్రందిపోవు
ఆ ఆనందోత్కట వాహినిలో
గలగల మని పడుచున్నవి
సెలయేళ్ళై, జలపాతములై



## ౪౧

నీ నా దాగుడుమూతలలో
యుగయుగాలు కడచన్నవి

నా మహిమను పెంచి పెంచి
ప్రసరింపజేసు నాల్గుదిశల
నీడద్దుదు నీ కాంతులపై
అదియే గద! నీమాయ

నిను నీవే విభజించుక
వేరిడు చుందువు విడివిడిగా
నీ స్వయం విభక్త ఖండరూపమే
నా దేహము—నేనూ

నీ ప్రఖరగీత సంగీతమె
ఆకాశపు టంచుల ప్రతిబాష్పములో
పలురకాల నవ్వుల, భీత్యాశల
నానారూపుల ప్రతిధ్వనించెడు

తరగలు చేకళించి మాసిపోవు
కలలును మొలకరించి కరగిపోవు
నీ జయపరాజయాల నీడను నేనే

ఈ విశ్వకళారంగములో
నీ వుంచినావు సన్నని యువనిక
రే బవళ్ళు అలయిక గీసెను
అది ఎన్నో రేఖల కలయిక

దాని వెనుక సింహపీఠి
వంకటింకర గీటుల
లేదొక తిన్నని ఋజురేఖయు
అది నిగూఢ రహస్యపుటల్లిక

నీ నా ప్రదర్శనచ్ఛవులతో
నిండెను ఈ పృథుమేదిని
నీ నాస్వర పల్లవితో
నిస్వనించె స్వర్లోకము

నీ నా దాగుడు మూతల
యుగయుగాల కథ చన్నవి

—□—

౭౨

నా అంతరాన అధిష్ఠించి
నిజ నిగూఢ రహస్యస్పర్శల
నను మేల్కొల్పు నాతడాతడే
ఈ కన్నులపై ఇంద్రజాలమిడి
నా హృదయవీణపై సానందముగా
సుఖదుఃఖపు భిన్నస్వరాల
మీటుకొను నాతడాతడే

స్వర్ణ రేఖ్య నీలహరిత
కాంతులతో నీ మాయాజాలిక
నల్లి తదావరణ నుండి
నిజ పాదాంగుళి వెలికిదీసి
నను సమ్మోహితు జేయు
నాత డాతడే

రేపుమాపు లెన్నొ గడచెను
శత సహస్ర యుగాలు చనె
భిన్న భిన్న నామరూపముల
విభిన్నానేక సుఖ దుఃఖోర్మ్ముల
నా హృదయ కళిని
పరిప్లవింప జేయు నాతడాతడే

—□—

## ౮౩

ముక్తి లేదు నాకు ప్రభు! విరక్తిలోన
నిర్మలానందపు సహస్ర నిగళ చయము
లోననె స్ఫురించునది నాదు లోష్టపాత్ర
మం దతి కషాయవాసిత మతిసురమ్య
వర్ణ సమ్మిశ్రితమ్మునైన భవ్యమదిర
నొలికిపోవ నింపుదువు నీ
జ్వలిత కాంతి

కళికనుండియే నేనసంఖ్యాక దీప
మాలల వెలిగించుకొని నీ మందిరస్థ
వేదికపయి నుంచితి పలువిధములైన
యింద్రియము లివి ఏమైన వీనిద్వార
బంధముల నేను మూయను గంధ శబ్ద
రూప రస సుఖమె నను నుజ్జ్వాత లూచు
నీ చిదానందమున
నాదు నిఖిల చపల

సంశయములును, భ్రమలును ప్రస్తమగును
నీ ఘనానంద వహ్నిలోనె మదీయ
లాలసయు పండు ప్రేమఫలమ్ము పోల్కి

—□—

# ౭౪

ప్రొద్దు గ్రుంకె నిన రశ్ములు
అరుణములై జాఱె నిసుల
జలభాండము నింప నేటి
సికతలపై కాలూనితి

చిఱు తెపకల చెలరేగిన, తె
మ్మెరరొద నన్నిరుల దరికి
జీరి పిలుచు చున్నదో యన
నైరాశ్యపు టలల కుదుపు
కయ్యాలపై బడి యుస్సురనగ
జలభాండము నింప నేటి
సికతలపై కాలూనితి
తెరువరియే కనరాని బాట
నే నొంటరిగా—

లోలోపల కలగె మనసు
ఇలు జేరుదునో మఱి
ఏమగుదునో
ఏ పెఱమానిసితో చెలిమగునో
ప్రొద్దుగ్రుంకె నిన రశ్ములు
అరుణములై జాఱె నిసుల

ఎవరోహో ! పరదేశస్థుడు
ఆపడవమీాద ఏటినడుమ
మురళివంచి మోవి చివర
నను పిలిచిన యటు లూదుకొనుచు
ప్రొద్దుగ్రుంక నినరశ్మిలు
అరుణములై జాఱువేళ

—□—

౭౫

మాకు నీ దేహాలకు పరమార్థములుగ
నీ విడిన బహూకృతులు మా నిఖిలకాంక్షి.
తముల నీడేర్చి మరల నీ దరికి జేసు
నక్షయముగ, ద్రుతపద విన్యాస సుభగ
లీ నదీమతల్లులు నిర్వహించి స్వీయ
విధు లనేకములు పొలాల వెల్లివిరిసి
పల్లియల దన్ని తుదకు నీ పాదధూళి
కడుగ తమకానవచ్చు
సుగంధ భరిత

కుసుమచయము పుష్పాడి జడిగురిసికోదమ
గాడ్పులం దూగియు, నిజ నిష్కామసేవ
నీ యడుగు దమ్ములర్చింప దివ్యస్వామి!
నీ యలఘుసేవనల దరిద్రీకృతమ్ము
కాదు, కాదు ప్రభు! జగత్యఖండధనము
కవి వతంసుని పదముల కెవరు వారు
నిజ నిజేచ్ఛల నర్థముల్ దీతురైన
వాని తుది సంగృహీత తాత్పర్యమీవె.

- ▭ -

## ౭౬

నిలుతునా నీ మ్రోల నిఖిల జీవననాధ !
ప్రణుతు లర్పించుచు ప్రతిదినమ్ము
నీ మహాభ్రము క్రింద నిస్తబ్ధముగ నిల్చి
కైమోడ్చు నా సముఖాన స్వామి !
తుముల సంఘర్ష నిస్తుల కార్యభార కో
లాహలాన శ్రమ చలాయమాన
యోద్ధృవిశ్వాన నీ యుర్వి ప్రజలగూడి
నిలుతునా నీ మ్రోల నిర్వికార !

ఓ యనంత ! ఓ తేజేడ! ఓ చిదాత్మ
నిర్వహించి సకలము నా సర్వవిధులు
నిర్మలముగ నీరవముగ నిభృతహృదయ
గాత్రుడనయి నిలుతున క్రేగంట దేవ !

## ౭౭

నాకు ప్రభువవు నీవని తలచి నీకు
దూరముగ నిలుచుంటి విస్తారగుణుడ!
నిన్ను నాత్మీయునిగ నింత తెలిసికొనగ
లేకపోవుట గద! యింత లేసిదూర
మందునుంటి, భావించితి నను గుపితను
పోల్కినద్దాన ప్రణమింతు పూర్ణభక్తి
స్నేహితునిపోలె మాత్రము చేర లేను

నీవు క్రిందకుదిగి నన్ను నీ స్వకీయ
జననిగా జూచుకొంటివి ఫలము లేమి
కాని నిను నేను స్నేహ హస్తాననూది
హృదయమున హత్తుకొనగ లేదింపుగూర్చు
నా సహోదరు లందఱు నాకుగూర్చు
సోదరుండ వుపేక్షించుచుందు వారి

నా ధనము వారికీయను నా సమస్త
మప్పనము జేసియుంట నీ యంఘ్రియుగళి
ఎపుడు నీచెంత నేయుంట నితరజనుల
హర్ష శోకాలనుండ నేనభిలషింప
జీవనమును విసర్జనసేయ సాధ్వ
స మగు గాన జీవనపు నిర్ఝరులమునుగ



## ౭౮

సృష్టి నవమోహనముగ రచింపబడిన
తొలి విభావరిలోన మేదుర నభోంత
రాళమున చుక్కలుండె ప్రవాళమాల
వోలె, సురలును చేసి పేరోలగమ్ము
వీణపై పాడుకొనినారు "ఎంత సుషమ
యనుచు పరిపూర్ణమనుచు నత్యంత శుద్ధ
సాత్వికానంద మనుచు ప్రశాంత మనుచు"

అంత చెలరేగె కలవరమాన భాన
చూడు డల్లది! ఆ కాంతి సూత్రమందు
జుణిగిపోయినయటు దోచుమణియొకర్తు
రిక్తమదిగో! కనపడుట లేదో యంచు
అఱచినాడొక్కరుడు వీణియ నవతంత్రు
లొక్కట పెళ్లుమనియె నత్యుగ్రసాధ్వ
సమలమికొనియె పాటలు సద్దుమణగె

నింగి మార్మ్రోగె ఫెళ్ళున నిజము నిజము
జాఱిపోయిన యా తార చరమ శోభ
చదలులో మిన్న సృష్టికే తుది మెఱుంగు

నాటినుండి తదన్వేషణమున నింగి
నేలయేకమై పోయె నేమూల విన్న
నొక్కటేధ్వని యకట! ఆ చుక్క లేని
సృష్టి సృష్టియె! దాని వైచిత్రిఁగాన
నొక మహత్తరానందము నోడిపోయె
జగతి, నిండురాత్రుల జగాజిగిమెఱుంగు

చిలుకతారలు మాత్రము పలుకుచుండు
పెదవి నిండుగనవ్వి "ఆ పేర్మిచుక్క
కొఱకు వెదకుట వ్యర్థము కొఱతలేదు.
సృష్టియంతయు పూర్ణము శ్రీ శుభమ్ము"

— □ —

## ౭౯

ఈ జీవన నిశ్వాసల కడ చివరివఱకు
నీ దర్శన భాగ్యము కలుగ దేని
అహర్నిశము వెతజెందుదు
క్షణమైనను మఱచిపోను
నిదురించుచు మేల్కాంచుచు
అదేపనిగ నొగులు చుందు
—'నీదర్శన భాగ్యము కలుగలేదు'

ఈ విశ్వ విపణి నడువీధిన
ధన సంద్రం వొడ్డొరుగుతున్న వేళ
స్వర్ణముష్టికలతో నాదరి నీదుచు
నాలో నే తలపోయుచుందు
'నా పెన్నిధి నింతకు పొందలేదు'
క్షణమైనను మఱచిపోను
నిదురించుచు మేల్కాంచుచు
అదేపనిగ నొగులుచుందు
—'నా పెన్నిధి నింతకు పొందలేదు'

ఒడలు బడల శిథిలాంగకాలు
దారికెలన గుడ్డ పఱచి
కూర్చున్న వేళ దుమ్ముపఱచి
'దూరమార్గమది ముందున్నది'
అనితలంచి బాధపడుదు
క్షణమైనను మఱచిపోను
నిదురించుచు మేల్కాంచు
అదేపనిగ నొగులుచుందు
—'దూరమార్గమది ముందున్నది'

అలికి ముగ్గులిడి నాయింటికి
నలుమూలల తోరణాలుగట్టి
హృద్యవాద్య సంరావంలో
కడు మౌనముగా మూల్గుచుందు
'పిలుపీయలేదు నీకింతకు' అని
క్షణమైనను మఱచిపోను
నిదురించుచు మేల్కాంచు
అదేపనిగ నొగులు చుందు
—'పిలుపీయలేదు నీకింతకు'

—□—

౮౦

ఓ నా తేజోమయ గభస్తీ!
శరద్ఘనపు అవశిష్టశకలం లా
తీరాడుచుంటి వ్యర్థంగా
నీకిరణం నాబిందుల సంస్పృశించి
బాష్పీకరించి నీజ్యోతిర్రేఖల
నన్నొక జ్యోతిగ చేయదేల?

దినములపై దినములు లెక్కించుచు
వెతల బ్రతుకు గడుపుచుంటి
ఇది నీవిలాసమా, ఖేలనమా
అయిన నన్ను నా అధమక్షుద్ర
శూన్యతలో నానారంగులు నింపుము

బంగరువంపుల తళుకులద్ది, చపల
వాయు మాగ్ధ్యంపై విసరుము
అఖండాద్భుతాల ముంచెత్తుము
ఈ క్రీడనుముగించ వేడ్కయైన
చల్లని నిశి తమసున కరగించుము

అదికాదే వేకువ రేకుల వెల్గుల
కొస చివరల నెఱుపెక్కించుము
శైత్యంలో శుచిశౌచ్యంలో
సంలీనమగుదు, కరగుదు

—□—

౧౭

వ్యర్థపుచ్చిన అతీత క్షణాల
దలచి మిగుల శోకించితి
నిజముగ వ్యర్థము కా లేదవి
నా బ్రతుకులోని ప్రతిక్షణము
నీ కనుసన్నల సురక్షితము

సకలవస్త్వంతరస్థితుడవై
బీజమునం దంకురాలు
మొగ్గలలో పూగుత్తులు
పూవుల ఫలచయమ్ము
లిడి సృజియింతు వీవు

ఒడ లలయగ సుక్కిసోలి
విశ్రాంతి శయ్యమీాన పండి
తలపోసితి పనులన్ని ముగిసె
తెరవారగ కనువిచ్చితి, నా
వాటికలో చిందులాడె పూమొగ్గలు

—□—

## రాత్రి

నిరవధిక కాలము గలదు నీ కరాన
శక్తి చాల దేరికీని నా క్షణములెంచ
రేలు బవలును శత సహస్రాలు గడచె
యుగ యుగములు ప్రఫుల్లించి యురలి నేల
రాలి పోవు చున్నవి చిఱు పూలమాడ్కి
కాని నీ వలయవు ప్రభు ! కటు నిరీక్ష

అడవి పూవొక్కటి సృజించు నంతలోనె
నీకు గడచు శతాబ్దముల్ నాకు నిరుప
యోగముగ బుచ్చుకడకు లేదొక్క నిముస
మైన నద్దాన నొత్తిడియైన పనుల
నుక్కి చిక్కయి పోయితి నొక్కలి ప్త
మేని ఆలస్యమును సైచుటెట్లు నా య
మూల్య సమయము పైబడి ముందుముందు
త్రోసికొనివచ్చి పోట్లాడి దొరకినంత
తన్నుకొని పోవుచుండు స్పర్ధాళుజనుల
నడుమ పంచుట లోననె గడచె వేళ
కడ నిమేషము వఱకును బడదు నీదు
వేదిక యెదుట నొక్క నైవేద్యకణము

దివసమేగుచున్నదన మదీయహృదయ
మమిత మారాటమును బొందునంత నీదు
ద్వాః కవాటము పడునన్న వ్యగ్రభీతి
పరుగు పరుగున వత్తు నాభాగ్యమేమొ
ఏదినమ్మున నైనను నీదుపూజ
జాఱిపోవదు పర్యాప్త సమయ ముండు

—౨—

## ౮౩

జననీ! నాశోకాశ్రుల, ము
త్యాల మాలజేసి నీకిత్తును
నీ చరణాలకు ఆతారలు
జ్యోతిర్నూపురాల జేసి
తొడిగెను, నా ముక్తాహారము
నీ ఉరస్సుపై వ్రేలునుగా
మణి కంఠాభరణముగా,

ఈ నిఖిల యశస్సంపద
నీయది, నీ యధీనము
నీయిచ్ఛచొప్పు నేమైనను
చేయుము ఎవరేమన్నను
ఈ శోకాశ్రులు మాత్రము
అక్షరాల నావిగాన నీపదాల
నొలకబోతు నద్దానికి
నీవిత్తువు అకళంక కృప



౮౪

ఈ వియోగ వ్యథార్తియె యీ మహోజ
గాన సర్వత్ర విరిసె నాకాశపథము
నం దసంఖ్య రూపాల నుయ్యాలలూగె
ఈ వియోగ దగ్ధ తపననే నభాన
తారలు చికు చిక్కున నొకదానినొకటి
మౌనముగ జూచుకొనుచుండు మబ్బుగములు
శ్రావణమున గుభిల్లున చదలునంట
ఆకులల్లన మ్రోయు నా యతుల విరహ
బాధయే నాల్గుదెసల వ్యాప్తమై మౌన
వీయగేహములం జొచ్చి ప్రేమ, కోర్కె
సుఖము దుఃఖము నయి పరిస్ఫూర్తిగాంచె
ఇదియె ననుబోలుకవిలోని హృదయఝురము
నుండి గీతులై పాఱు వినూత్నఫక్కి



౭౫

ఆ భట సముదాయముల అవ్యాహత బల
మెచట గలసెనోకద? స్వామి యిల్లువిడిచి
వచ్చిన తటి వారల ధనుర్బాణశక్తి
బాహుదార్ఢ్య మేమయ్యెనో వాడిపోయి
వివశవదనులై చనినారు, రెండి ప్రభు గృ
హామునకు తరలివచ్చిరి అపుడు మరల
వారిశక్తి నెచట దాచినారొ అస్త్ర
శస్త్రముల నెయ్యెడ నునిచి చనిరొకాని
వారిమోముల నీసారి భవ్య శాంతి
తేజ మోలలాడుచునుండె దీప్తరుచుల



నీ సఖియట మృత్యుదేవి
నా ద్వారముకడ నిలిచె నేడు
అజ్ఞాత జలధి నీదియాది
నీవార్తను తెచ్చెనేదో

నిశీథమిది కడు చీకటి
నా గుండియలో వెఱ్ఱిభయము
ఏమైనను నా గృహదీపికతో
తలుపు తెఱచి స్వాగతమందును
శిరమునొగ్గి ఆతిథ్యమిడుదు

నీ సఖి యది మృత్యుదేవి
నా ద్వారముకడ నిలిచెనేడు
కేలుమోడ్చి కన్నీరుల
అభిషేకించెద, అర్చించెద
హృదయమణులు తచ్చరణధూళి
వడివడిగా కురిపించెద

స్వాభిలాష నీడేర్చుకయే
తరలుగాని నా వేకువపై
తమచ్ఛాయగూడ గీసిపోవు

నా పేదఆత్మ ఒంటరిగా
నా శూన్యాంగణాన నిలిచియుండు
నీ చరమ సమాగ మాత్యంతన
నీ సఖి యది మృత్యుదేవి
నా ద్వారము కడనిలిచె నేడు

—□—

౭౪

వెదకిచూడ నిరాశగ వెళ్ళినాను
నా గృహమును, కానియది కన్పడనె లేదు
ఇఱుకు గృహమగుట నచట కేగువారు
మగిడి కన్పించ రెవరును గగనమట్లు
అతి విశాలము నీ గృహమఁలతనైన
దాని వెదకనే గద! నీదు ద్వారకవాట
సీమ వఱకు వచ్చితి నీ రుచిర సువర్ణ
సాంధ్య శోణితాకాశ పేశల వితాన
పటము క్రిందుగ నిల్చి పిపాసు దృగుల
నిన్ను గాంచుచుంటిని స్వామి! నిత్యతా త
టాన నిపుడు నిల్చితి నేదియైన నిచట
లుప్తమై పోదు చూపుకు గుప్తమగుట
యన్న దేవుఁడ దేదియు నాస, హర్ష
మేదియైనను లోపించదే ప్రతప్త
బాష్పపూరితానన దృశ్యఫలకమైన
లుప్తమైపోదు నీదు కల్లోల జలధి
నడుమ నా శూన్య జీవనమడుగుదాక
ముంచుమా దేవ! లోతైన పూర్ణతా జ
లాన ముంచియెత్తుము ప్రాగ్దినాన నెపుడొ
జాఱిపోయిన కోమల స్పర్శసుఖము
మగిడి పొందిన యానందమగును నాకు

—□—

తెగినది వీణతంత్రి భవదీయ యశస్స్తుతి పాడనేర దె
ట్టిగ నినదేవు డ స్తగిరి వ్రాలెను హారతి వేళ తెల్పు గం
ట గణగణల్ చెవింబడ వెడారి ప్రయాణము చేయుచున్న పో
ల్కి, గగనభేది వాయువులు కిమ్మనవెందుకు నిన్నుగూర్చి ఓ
విగళిత భగ్నమందిర నివేశితదీన దరిద్ర దేవుడా !
పగిలిన నీగృహాన చొరబాఱెడి యామధు మాస వాయువుల్
రగిలిన బాధతో వినగరాని సుడుల్ వినిపింపవచ్చె నీ
దు గళమునం దలం కృతిగ దోగనయిష్టత జూపెనంట పూ
లు, గతవిలాసముల్ గరగి రూపఱెనోయి నివాసభగ్నుడా !
మునుపటి పాతయర్చకుని మోమున తీవ్ర విషాద రేఖలే
కనుపడె, ప్రొద్దుగ్రుంక నినకాంతుల పల్చని యెఱ్ఱవల్వ హె
చ్చిన తిమిరాన జట్టుకొని చిక్కని ధూళుల చిన్గుచుండ నా
వెనుకటి పాతయర్చకుడు వెఱ్ఱిగ నాసయెడంద పచ్చెడిన్.
పరువిడి వచ్చివచ్చి పెనుపండువ ఉత్సవముల్ విషణ్ణతన్
జెఱిగిన నిన్నుగాంచి సడిచేయక చెచ్చెర వెన్కబోవు, శ
ర్వరుల వశిష్టదీపముల వత్తులు వెల్గిన భాగ్య మబ్బ కే
శిరములు వాంచి పోయెడి విశీర్ణ వివిక్త నివాస జీర్ణుడా !
ప్రవరకళా విశారదులు ప్రాభవమొప్ప వినూత్న శిల్పముల్
నవనవ శోభలన్ జిలికి నాణ్యముగా రచియింతురెన్నడో
అవి విలయించి పోవు సమయాంబుధి మున్గి పవిత్ర రేఖలై
అవనత శౌర్యమాప్రతిమ యట్టులెపూజలువోయి మూల్గెడున్



## ౮౯

ఉచ్చైస్స్వరాన నిక నే పిలువను
బహునెమ్మదిగా కహుచానముగా
నివేదించ నా ప్రభుని ఆజ్ఞ
నా హృదయధ్వని సన్నని గీతుల
మృదుః కాకస్వనంలో వినిపించెద

ప్రజలరుగో! తిరునాలవోలె
రాచ విపణి దివవెచ్చపు సందడి
క్రయవిక్రేతల తుములఘోష
ఈ పని తొందరలో నడియొండన
వేళగాని తఱి గాటపు టగ్గిన బడి
నే నొక్కడ వచ్చితి విపణి విడిచి

నా ఉపవనాన పూలజల్లు
విరియనిమ్ము మధ్యాహ్నమునందే
తేనీగల రొద సేయనిమ్ము
సదస ద్వివేక ద్వైధములో
గడచిపోయె నా దీర్ఘవేళ

ఈ రిక్తజీవన క్షణ సహచరు
డేలకో నా హృది కేలనూది
లాగికొనగ జూచెను తన వైపును
ఏ నిరర్థక కార్య మీయుకోర్కె-
నను పిల్చినాడు ఉవ్వెత్తుగ.

—□—

౯౦

మృత్యువు నీ తలుపు దట్టి
పిలిచినపుడు నీ వేమిత్తువు!
నా అతిథి మ్రోలనిల్పెను
నా జీవన పరిపూర్ణఘటమును
రిక్తపాణిగో ననుపదాని
శరద్దినాల, వసంతరాత్రుల
పెర తేనెలు, పూజల్లులు
వ్యగ్రకార్య సంరంభంలో
నే సాధించిన నిధులు, సిరులు
అన్నియు నేనిత్తును నాతలుపు
దట్టి మృత్యువు ననుపిలిచినపుడు

-□-

## ౯౧

ఓ నా జీవన పూర్ణబిందు, మృత్యూ!
చెవిలో చెప్పుదువేమిటి మెల్లగ
రేబవళ్ళు తలవరినైతి నినుకాచితి
నీకై సుఖదుఃఖము లోర్చితి

నేను, నాది, నేనాసించితి నెద్దానిని
తత్సర్వము, నా ప్రేమవిత్త సర్వస్వము
నీకై ప్రవహించెదు, నీ
రహస్సృష్ట పథములబడి
నీకన్నుల తుది వీక్షణతో
నే నొక్కుమ్మడి నీవాడనగుదు

నును ప్రేళుల బొదివిన దీ పూలమాల
వరునకు గై సేయుటయే తడవిక
పరిణయమై వేడుకచన
వధువేగును నిజగృహముపీడి
ఏకాంత శూన్యరాత్రియిరుల
పతిని గలియ ఏకాకినిగా

—□—

## ౯౨

నామది కెందుకో అనిపించెను
తిరిగి చూడనిక ఈ జగతిని అని
నే వెడలు సమయ మయ్యెను అని
నా కన్నులపై తుది యవనిక నిడి
మెల మెల్లగ చను నా జీవనమని
నామది కెందుకో అనిపించెను

తొంటివలెనె వేకువ కాగా
ఇనుడు పొడుచు చుండునా!
ప్రొద్దు గ్రుంకి చీకటిపడగా
నక్షత్రపథము వెల్గునా!
నే నేగిన తరువాత కూడ
జలధివోలె కాలతటిని
సుఖదుఃఖోర్మ్ముల చిమ్ముకొనున!

ఈ క్షణాల తుది అంచున
దృష్టినిలిపి చూచినపుడు
మది కెందుకో అనిపించును
ఈ నశ్వర కటుకాల పరిధు
లొకటొక్కటి తునుగును అని
మృతి వెల్గున కనుపట్టెడు
అవలి తీరము చిరమని

కటికి నేల మురికి బ్రతుకు
లేదని అట దుష్ప్రాప్యము అని
నామది కెందుకో అనిపించును
తిరిగి చూడనిక ఈ జగతిని అని

కొంగాములు ఈ వస్తువులు
కోరినవి నా కొనగూడినవీ
ఆ స్థిరవస్తువుకై అభిసరింతు
అవమానించితి నెద్దానిని
తెలియక అపహాసించి తెద్దానిని
నా మది కెందుకో అనిపించును
తిరిగి చూడనిక నీ జగతిని అని

## ౯౩

వీడ్కోల్పుడు నన్నిక తమ్ములార !
నే వెడలు సమయమయ్యె ప్రణుతి మీకు
సాగుచుంటి. సెలవు సెలవు,
ఇదిగో ! నా గృహద్వారము చెవి
వాడుకొనుడు హక్కుకూడాది

మీమీ తుది మధురోక్తులు
వినిపింపుడు చాలు నాకు
ఎన్నో యేడులు ఇరుగు పొరుగు
వారల మిక వలనుపడదు
నే నిచ్చినదే కొంచెము
పుచ్చుకొంటి నత్యధికము

చీకటి కోణపు యిఱుకులనడుమ
వెలిగి వెలిగి నాదీపిక యిపు
డాఱిపోయె పొడిచె ప్రొద్దు
పిలుపందిన దిక సాగుచుంటి
వీడ్కోల్పుడు నన్నిక తమ్ములార !



## ౯౪

ఓ నా ప్రియ మిత్రులార !
మహాప్రస్తానవేళ నన్ను
శుభకాంక్షల వీడ్కొల్పుడు
అరుణారుణ రేఖలతో
వెల్లివిరిసె తొలివేకువ
సుఖప్రదము ముందు బాట

దారిపొడుగునే పాథేయము
ఎటుల బోదువం చడుగకండి
శూన్యపాణి నైననేమి ! నాహృది
నిండెను నరవాంఛల బరువుగ
నాకీ యాత్రోచిత వేషమేల ?
కై సేసికొంటి ప్రణయమాల
అడుగడుగున సంకటాలు
అయిన భయమొకింత లేదు

నాయాత్ర ముగిసిపోవునంత
సాంధ్య తార వెలుగునంట
సాంధ్యకాల మధురస్వనాల
స్వామి గృహము మ్రోగునంట
ఓ నా ప్రియమిత్రులార !
మహాప్రస్థానవేళ, నన్ను
శుభకాంక్షల వీడ్కొల్పుడు

—□—

## ౯౫

చిఱుత తనాన జీవన దేహళిపై
కాలూనిన తొలిరోజున ఎఱుగను
తుది క్షణము ఒకటున్నదియని

అర్ధరాత్రి అడవిమొగ్గ విరిసినట్టుల
నను వికసింపజేసె నేదొ శక్తి
ఈ రహస్య ఖేలనలో
వేకువ కాగా వెలుతురులో
అనుపించెను నేనిట కాను పరాయిని

నామరూప రహితమూ అచింత్య
శక్తియే నన్నొడికిదీసె తల్లిపేర
మృత్యువేళకూడ ఆ అనంతశక్తి
వ్యక్తమగును చిరపరిచితివలె
బ్రతుకన నాకొక సుఖవిపంచి
మృతియును కాకూడదు జీర్ణకుంచి

కుడి కుచమునుండి యెడమకు
మార్చుచున్న తల్లినిగని పిల్లడు
ఏడ్చును వెనువెంటనె ఊఱడిల్లు

—□—

## ౯౬

అత్యద్భుత మిట నేకన్నది ప్రతిదీ
అని నా తుది వాక్కున జెప్పికొందు
సుప్రకాశ జలధి వీచికపై
పద్మపుటములోని తేనె పెరను
కడువెచ్చగ జుట్టుకొంటి
మహాద్భాగ్య శాలినైతి
అత్యద్భుత మిట నేకన్నది ప్రతిదీ
అని నాతుది వాక్కున జెప్పికొందు

నానా రూపాశ్రిత
మీ క్రీడా వేదిక
నిర్వహించినాను నా భూమిక
రూపరహితు దర్శించితి
అత్యద్భుత మిట నేకన్నది ప్రతిదీ
అని నా తుదివాక్కున జెప్పికొందు

స్పర్శాతీతుని స్పర్శలోన
నఖశిఖమ్ము పులకించితి
ఇదియే తుది యగుచో
అగునుగాక నా కిక
అత్యద్భుత మిట నే కన్నది ప్రతిదీ
అని నా తుదివాక్కున జెప్పికొందు

—□—

## ౯౭

నీ సహవాసినై మురిసి నీకరి తాడితి పెద్దప్రొద్దు, నే
నేసమయానమైన నిను నెవ్వర పేచని పృచ్ఛజేసి నా
నా! సకలాత్మ! నాకు గలవా! యనుమానము భీతిగాని యే
దో సమతాప్రవృత్తి ననుద్రోయగ నాడితి స్వేచ్ఛస్వేచ్ఛనై

నెచ్చెలివోలె నాయనుగు నేస్తముపోల్కి ప్రభాతవేళ కా
వచ్చిన నిద్రలేపి సమభావన ప్రొద్దుల నాటపాటలన్
బుచ్చగ నన్నుదీసికొని పోయెదు వాసనకూన రెల్లుపూ
బచ్చిక నీవు ముగ్ధముగపాడిన పాటల కింత యర్థమున్.

తెలిసికొనంగ జాలితె, ధ్వనించగరాని స్వరాల నేకుయో
తెలియదు గొణ్గినాను కడుతీయసుఖాన మునింగినాను, క
న్నుల కొకవింత దృశ్యమెదో తోచెను నీమహనీయ క్రీడయం
చల నపుడప్పుడే కరగుచుండిన వేళవిచిత్రమీచరా

చరసకలోర్వి సుంత సడిచప్పుడు లేని యనంత తారకల్
స్థిరతర విత్తమై నిజవశీకృతమై చెలువొంద వాని నీ
చరణములందు జేర్చి అతిశాయి వినమ్ర విశాల నేత్రమై
కరములుమోడ్చి నీదు సముఖమ్మున నిల్చెను స్తబ్ధచిత్తతన్

— □ —

నీ విజయాంక చిహ్నముగ నేకయి సేతు పరాజయాల మా
లావలయమ్ము నాకు జయలాభము గొంద నశక్యమెద్ది యో
భావన పెల్లుగా మదిని భ్రాంత నొవచ్చు ఫెటిల్లుమంచు నా
జీవన బంధముల్ దెగి హసించునటంచు మదీయ శూన్యమా

గానము పొల్లవోవు వట్టికర్కశ నాదము నింపునంచు పా
షాణము లన్ని యుంగరగి సాశ్రుఝరుల్ వెలయించునంచు నా
లోనగలంచు నేనో మదిలో నదినైజము, కాక ఈవనే
జానన మెప్పుడున్ ముకుళ మట్టులె యుండున! వ్యాకుచించదా!

ఏనాడో యొకనాడు నాకసమునం దేయొక్కకన్నో కటా
తానన్ బిల్చునలే ననున్ దునుగ నాకాంక్షల్ మదీయమ్ములో
కానన్ జెప్పగ నుండ దొక్కటియు నా గాత్రమ్ము నీపాద పీ
ఠానన్ వ్రాలి పడుండ నాకొదవు గాఢస్ఫీత మామృత్యువే !

— ◻ —

## ౯౯

నేను చుక్కాని వదలితి నేని నీవె
దీని నిక జూచు తఱి యరుదెంచెనంచు
దలచి నాడను తదుపరి త్వరితగతిని
కాగలట్టిది సర్వము గాకపోదు
లేనిపోని సంరంభముల్ దీని కేల!
హృదయమా! చాలు నీవిక పదిలముగనె
కూరుచుండుము మోటమికి చిట్టూఱడిల్లి
ఓర్చుకొనుము సమస్తమీ యున్న యునికి
లోన నుంటయె మంచి దెద్దాన జూడ

గాలితాకున నాదీప మాలలాఱి
పోవుచున్నవి పాటిపాటి వోవువత్తి
కేల ద్రోసి సారెకు వెలిగించుచుంట
లోనె మఱచితి సర్వమద్దానయుక్తి
సేతు నీసారి ప్రాంగణ సీమయందె
ఆసన మమర్చి కూర్చుందు నంధకార
మైన నేమాయె, జూతు కన్గొనవిచ్చి
పిదప నీయిచ్చ చొప్పు నేవేళయైన
నధివసింపుము నాపీఠి అఖిలనాథ

—□—

౧౦౦

సాకారపు కడలినడుమ మ్రుం
గుడు వడి అట్టడుగున
నిరాకారపు నిండుముత్తి
యాన్ని నెమఁకబోవుచుంటి

ఈ కాలశిథిల నౌకలోన
ఇక రేవు రేవు కలయ దిరుగ
పెల్లటుచు అలల లోక చివరి
దెబ్బల కిక నవ్వుకోను
అమరతలో మృతించిపోవ
నాస కలిగె అగాధత్వపుదరి
జరుగు నొకటి పాటకచేరి
నిస్స్వర తంత్రులతో రవించు
నా జీవన పరివాదినిలో
ప్రవేశింతు దాని మేళవింతు

తుది చరణం పాడి పాడీ
మౌనమగును నా వీణియ
నా మౌన విపంచిని ముంచివైతు
కడసారిగ చిర మౌనంలో

—□—

ఆ జీవనమూ తిరిగినాను గీతులతో
నిన్ను వెదుక, అమూల్య పరిశోధన
అసంఖ్యానుభవాలు,నాబహిరంతర్జగతులు
ఇంకెన్నో ఎఱిగినాను గీతులతో

నే నేర్చిన దసంత మీగీతులు నా రోజులు
అతిగుప్తపథము లెఱుకజేసి
నా హృదయాంతరిక్ష వైశాల్యంలో
వెలుగుచున్న చిర తారల
విషయంలో చెప్పిన వెన్నోలోతులు

నా సుఖదుఃఖోజ్వల జగత్తున
దాగిన రహస్యాల యాత్రసేయ
హెచ్చరించి దారి జూపె
ఈ యాత్రావసాన సమయంలో
వెలిగిన దదిగో! సంధ్యారుణిమ
న న్నే మహారాజు కోటముందు
నిలిపినవో మఱి యీ గీతులు



స్వాతిశయ మధికము నాకుస్వామి! నిన్ను
నేన యెఱుగుదునని, వారు నీ సురమ్య
చిత్రము వెదకుచున్నారు చీల్చి చెరిపి
నాదుకావ్యాల, నడుగుచున్నార లీత
డెవ్వరని నేను నిక్కవమేమి చెప్ప
లేనని వచించి నా నంత లేనిపోని
దోసములు పుల్మి నోరార తూలనాడి
పోవుచున్నారు కడు చిన్నపోతి, నచటె
నీవు నిలుచుండి నవ్వుచున్నావు స్వామి !

పాడుకొనుచుంటి భవదీయ భవ్యగాథ
నాదుగీతుల హృదిలోన నాల్గుదెసల
ప్రోదియైన దంతయు వెళ్ళబోసుకొంటి
మరల వారలడిగినారు మాకు సుంత
తెలుపరాదో తదర్థము నిజము నేను
సైతమేమి చెప్పగలాను సత్య మేరి
కైనను తెలియునా వీని యర్థమంటి
నంత పక్కన నగి నన్ను నలతపఱచి
వెడలిపోయిరి తలపోసి వెఱ్ఱిసటుల
నీవు నిలుచుండి నవ్వుచున్నావు దేవ !



౧౦౩

హే ప్రభో! వరం మే దేహి
ఏకైక ప్రణిపాతేన యేన
మమేంద్రియాణి సర్వాణ్యభిసరంతు
సర్వం విశ్వం సంస్పృశ్య
త్వామభిసరంతు

అనుద్గీర్ణ శ్రావణ జలస్తిమితః
నీచైర్గచ్ఛతి యథా మేఘ శకలః
తథా స్వాంతం మే నమతు
భవత్ప్రాంగణే వినమ్రీభవతు
ఏకైక ప్రణిపాతేన

వినిసృత్యైక ధారాయాం
మమగీతాన్యసంఖ్యాని
వివిధస్వర కల్లోలితాని
పతంతు భవ దగాధ మౌన -
జలధిమధ్యే నిపతంతు
ఏకైక ప్రణిపాతేన

యథావ్యపగత నివాసాః
శ్వేతహంసా న క్తం దిన ముడ్డీయానాః
నిజశైలాంతర్గత కులాయే ష్వాపవిశంతి
తథైవేదం మమ జీవనం పృథు
నిజగృహం ప్రాప్తన ముపైతు
ఏకైక ప్రణిపాతేన

